

# ఆశ్రమంలో
# ప్రతి ఏకాదశినాడు ఉదయం
# శ్రీశ్రీశ్రీ కల్యాణ వేంకటేశ్వర స్వామి వారు

క్షీరాభిషేక కైంకర్యాన్ని స్వీకరిస్తారు!
మనని వాత్సల్యంతో పలుకరిస్తారు.
చాల అద్భుతంగా ఉంటుంది ఆ దివ్య సౌందర్యం!
తెల్ల పాలధారల వెనుక నుంచి నల్లని స్వామి దివ్యమంగళ
విగ్రహపు చిరునవ్వు ఎంతో ముచ్చటగా ఉంటుంది.

వక్షస్థల లక్ష్మి దర్శనం స్పష్టంగా కలుగుతుంది!
ఇంతెందుకూ? జన్మ ధన్యమౌతుందంటే చాలు!!

తిరుమలలో జరిగే శుక్రవారపు అభిషేక దర్శనం తిలకించడానికి
దశాబ్దాలు వేచియుండాలే అనే విచారాన్ని తొలగించి
అపురూప ఆధ్యాత్మిక తరంగాలలో ఓలలాడిస్తుంది.
అభిషేకానంతరం స్వామి నిజపాదదర్శనం భాగ్యం
ఉచితంగా కలుగుతుంది.
ప్రతి ఏకాదశిని ఈ దివ్య దర్శనంతో సార్థకం చేసుకుందామా?

**ఏకాదశినాటి క్షీరాభిషేక కైంకర్యము (ఇద్దరికి మాత్రమే ప్రవేశము) రూ. 2,000/-**

మరిన్ని వివరాలకు

**శ్రీ జీయర్ స్వామివారి ఆశ్రమము**
జి. వేమవరం - 533 461, కోరింగ పోస్ట్, తాళ్ళరేవు మండలం, తూ॥గో॥జిల్లా
ఫోన్స్: 0884-2315355, 2371064, 98854 38938.

# ప్రార్థన



అగ్రే కృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠన్
పశ్చాత్ పార్థం ప్రణయ రసజుషా చక్షుషా వీక్షమాణః।
సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రాం
అబిభ్రాణో రథ మధివసన్ పాతు న స్సూతవేషః॥

స్వామి ఒక కాలును ముందు చాచి రెండవ కాలి యొక్క మోకాలి భాగమును రథకూబరమున ఆనించి ఉన్నారు. స్వామి దృష్టి అపారమైన ప్రేమను సూచించుచు అర్జునుని యందు ప్రసరించుచున్నది. గుఱ్ఱములను నడుపుటకు వీలైన తోత్రము (కొరడా)ను ఎడమ చేత ధరించి జ్ఞానోపదేశ సూచకముగా కుడిచేత జ్ఞానముద్రను ధరించి, సారథి వేషముతో రథమున వేంచేసియున్న శ్రీకృష్ణ పరమాత్మను ధ్యానించుచున్నాను. ఆ శ్రీకృష్ణ పరమాత్మ మనలను రక్షించుగాక.

**గీతాజయంతి 6-12-11** ***

"వందే వేదాంత కర్పూర చామీకర కరండకమ్।
రామానుజార్య మార్యాణాం చూడామణి మహర్నిశమ్॥"

# శరణ్య

ఆధ్యాత్మిక పత్రిక

సంపుటి - 15 సంచిక - 7 డిసెంబరు 2011

★

వ్యవస్థాపకులు
**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారు**

★

సంపాదకులు
**శ్రీమాన్ చిత్రకవి ఆత్రేయగారు**
బెంగుళూరు - 78.
ఫోన్ : 080-26490364.

## ముఖచిత్ర పరిచయం



శ్రీమదష్టాక్షరీ క్షేత్ర నిలయం కరుణానిధిమ్।
శ్రీమద్వైకుణ్ఠనారాయణం పదాసముపాశ్రయే॥

## విషయ సూచిక



# శరణ్య

పత్రిక విడి ప్రతి రూ॥ 25/-
సంవత్సరం చందా రూ॥ 200/-

చందాసొమ్ము
"శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్యపీఠము"
కాకినాడ పేరున డ్రాఫ్టు ద్వారాగాని, యం.ఓ. ద్వారాగాని
క్రింది చిరునామాకు పంపించవచ్చును.

**SECRETARY**
**OFFICE OF THE JEEYAR SWAMIJI**
D.No. 7-7-41, Cement Road,
Ramaraopeta, **KAKINADA - 533 004.**
E.G.Dist. Andhra Pradesh.
Ph: 0884-6588107, 2371064.

# శ్రీకృష్ణార్జున సంవాదం



2718 ప్ర. **ఈ 9వ శ్లోకంలో పదాలు కొంచెం తమాషాగా ఉన్నాయి. సుహృత్తులన్నా మిత్రులన్నా ఒకటే కద! మరి ఆ రెండూ ఎందుకు చెప్పేరు? అరి అంటే. శత్రువు. ద్వేషించే వాడే కద! అయినా రెండు పదాలు ఎందుకు వేసేరు? ఉదాసీనులన్నా మధ్యస్థులన్నా ఒకటే కద! రెండూ పదాలూ వేసేరే?**

జ. నువు చెప్పినవన్నింటినీ వాడుకలో మనం పర్యాయ పదాలుగా వాడెస్తున్నా, చిన్న చిన్న తేడాలున్నాయి మరి. సుహృత్తంటే వయస్సుతో నిమిత్తం లేకుండా హితం చేసేవాడు. మిత్రుడంటే సమాన వయస్కుడై హితం చేసేవాడు. కారణాన్ని అనుసరించి అనర్థం చేసేవాడు శత్రువు. జన్మ సిద్ధంగానే అనర్థం చేసేవాడు ద్వేష్యుడు. కారణం లేదు కనుక మంచి, చెడు చేయని వారు ఉదాసీనులు. జన్మ సిద్ధంగానే ఎవరికీ ఉపకరించక అపకరించక ఉండే వారు మధ్యస్థులు.

2719 ప్ర. **ఇంతకీ ఈ ఆత్మ సంయమ యోగాన్ని ఎలా చేయాలి? అంటే మనస్సునెలా నిగ్రహించాలి?**

జ. ఇక్కడొక అవగాహనాలోపం రాకుండా జాగ్రత్తపడు. నదీ ప్రవాహానికి ఆనకట్ట కడతారు. కాలువల ద్వారా ఆ నీటిని తమకి కావలసిన ప్రాంతానికి తరలిస్తారు. అదే ఆత్మ సంయమయోగమని గ్రహించు.

2685 ప్ర. **మీ ఉద్దేశం అర్థం కాలేదు నాకు.**

జ. నదికి కేవలం ఆనకట్ట కట్టి ఊరుకుంటే అది ఊళ్ళను ముంచెస్తుంది. అనర్థహేతువవుతుంది. అలాగే మనస్సుని నిగ్రహించడం మాత్రం చేస్తే అది కూడ అనర్థాన్ని తెచ్చెస్తుంది యోగ విరమణానంతర దశలలో. అందుచేత దానిని తగినట్లు మళ్ళించడం కూడ చేయవలసి ఉంటుంది.

2721 ప్ర. **సరే బాగుంది కాని ఆ ప్రాసెస్ ఎలా ప్రారంభించాలి?**

జ. పదో శ్లోకంలో చెప్తున్నారు విను. **యోగీ యుంజీత సతతం, ఆత్మానం రహసి స్థితః ఏకాకీ యతచిత్తాత్మా,**

నిరాశీరపరిగ్రహః - అన్వయం - **యోగీ సతతం ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీః అపరిగ్రహః రహసి స్థితః (సన్) ఆత్మానం యుంజీత** - తాత్పర్యము - ఈ యోగము చేయువాడు ఎల్లపుడు ఏకాకి అయి చిత్తమును నియమించుచు ఆశలు లేనివాడై ఏమియు స్వీకరింపనివాడై రహస్యమందుండి ఆత్మను యోగమందుంచవలెను.

2722 ప్ర. **ఉహూ! లాభం లేదు. అంతా కన్ఫ్యూజనే, రహస్య మందుండి అంటూ మళ్ళా ఏకాకీగా ఉండమనడమేమిటి?**

జ. **పదిమంది కలిసి రహస్య ప్రదేశంలో కూర్చొని యోగం చేయవచ్చు కద! అలా పనికి రాదని చెప్పడానికి ఏకాకీ అని కూడ అన్నారు.**

2723 ప్ర. **రహస్య ప్రదేశమేంటే? ఎవరూ ఎరగనిదనా?**

జ. కాదు. 'రహసి' అంటే ఎవరూ లేనిచోట అని అర్థం.

2724 ప్ర. **సులువే?**

జ. కాదు. ఎటువంటి అలికిడి వినబడకూడదు కూడ.

2725 ప్ర. **అంటే శబ్దాలుండకూడదా?**

జ. పశుపక్ష్యాదుల శబ్దాలున్నా ఫర్వాలేదు. మనకర్థం కావు కనుక. మానవ సంభాషణల శబ్దాలు చెవిన పడని చోట ఉన్నపుడే ఏకాగ్రత సాధ్యమౌతుంది.

2726. ప్ర. **సతతం అన్నారు కద! ఇక జీవితాంతం అలా ఒంటరిగా ఉండి పోవాలా?**

జ. అది అసాధ్యమయ్యా! ఆచరణ యోగ్యం కాని వాటిని గీతాచార్యుడు చెప్పనే చెప్పడు. ఇక్కడ **సతతం** అంటే 'ఎప్పుడు యోగానికి సిద్ధపడినా' అని అర్థం.

2727 ప్ర. **ఆశలేక పోవడం, స్వీకరించక పోవడం ఏమిటి?**

జ. **నిరాశీః** - ఆత్మదర్శనము కోనం ప్రయత్నిస్తున్నవాడు కనుక తదితర విషయాలను ఎవరైనా తనకి అందించాలనే ఆశ ఉండకూడదు. అపరిగ్రహః - తానాశ పడనప్పటికీ తనంత తను వచ్చింది కద అని సమర్థించుకొని దేనినీ స్వీకరించ కూడదు.

2728 ప్ర. **సామాన్యుల విషయంలో ఇవన్నీ సాధ్యపడతాయా?**

జ. చిరకాలం కర్మయోగాన్నభ్యసించి, అది తనంత తాను జ్ఞానయోగంగా పరిణతి చెంది యున్న వాడికీ పాఠం. వాడికి ఆత్మదర్శనమందు ప్రీతి అప్పటికే కలిగి పోయి ఉంటుంది కనుక సాధ్యమే.

2729 ప్ర. **మరోమారు చెప్పండి!**

జ. అమెరికా గురించి వినగా వినగా ఆ దేశాన్ని చూడాలనే కోరిక కలగడం,

అమెరికా అంటే ప్రీతి పెరగడం జరుగుతాయి కద! ప్రీతి కలుగగానే వీసా కోసం ప్రయత్నాలూ మొదలవుతాయి. అలాగే కర్మయోగ జ్ఞానయోగ దశలలో ఆత్మయందు రతి కలగడం సహజం. వాడు చేసే ప్రయత్నం ప్రక్కదారి పట్టకుండా ఉండడానికీ సూచనల పరంపర నడుస్తోంది.

2730 ప్ర. **అర్థమైంది. విషయం తెలునుకొని ఉపన్యాసలలో మాత్రం చెప్పే వాళ్ళ కోసం కాదని కదూ మీరంటున్నారు?**

జ. **ఉపన్యాసలు అంత తేలిగ్గా కనిపిస్తున్నాయా, మీకు? ఉపన్యసించడం కూడ ఒక తపస్సే. స్వాధ్యాయము, ప్రవచనము కూడ తపస్సులే అని ఉపనిషత్తు చెప్తోంది. ప్రవచనం అంటే మననమే.**

అందుచేత చెప్పగా చెప్పగా చెప్పగా, ఆత్మ విషయమందు ప్రీతి కలగడం ప్రయత్నించడం అసాధ్యమేమీ కాదు.

2731 ప్ర. **సరే ఒప్పుకున్నాను లెండి! ఇంకా ఎలా ఉండాలో చెప్పండీ ఆత్మ సంయమయోగం ఆచరించేటప్పుడు-**

జ. 11, 12 శ్లోకాలు వరుసగా చూద్దాం - **శుచౌ దేశే ప్రతిష్ఠాప్య, స్థిరమాసన మాత్మనః, నాత్యుచ్ఛ్రితం నాతినీచం, చేలాజిన కుశోత్తరమ్, తత్రైకాగ్రం మనః కృత్వా, యత చిత్తేంద్రియ క్రియః, ఉపవిశ్యాసనే యుంజ్యాత్, యోగమాత్మ విశుద్ధయే!**

2732 ప్ర. **అన్వయం రెండు శ్లోకాలకి కలిపే చెప్తారా?**

జ. అవును. **శుచౌ దేశే, స్థిరం, న అతి ఉచ్ఛ్రితం, న అతి నీచం, చేలాజిన కుశోత్తరం ఆత్మనః ఆసనం ప్రతిష్ఠాప్య తత్ర ఆసనే ఉపవిశ్య మనః ఏకాగ్రం కృత్వా యత చిత్తేంద్రియ క్రియః ఆత్మ విశుద్ధయే యోగం యుంజాత్**

2733 ప్ర. **తాత్పర్యం కొంచెం వివరంగా చెప్పండి!**

జ. సరే! యోగాభ్యాసానికి కావలసిన ప్రదేశం ఎలా ఉండాలో మొదట వివరిస్తున్నారు. శుచిగా ఉండాలది. అంటే కేవలం శుభ్రంగా ఉండాలని అర్థం కాదు. ఆ స్థలం ఎవరిదో వారెటువంటి వారో చాల ముఖ్యం.

2734 ప్ర. **అవునా? అంత తేడా ఉంటుందా?**

జ. ఉంటుంది. ఒక వ్యక్తి భావాలు ఆ వ్యక్తి నివసిస్తున్న లేదా నిర్వహణలో ఉన్న స్థలాలకీ వస్తువులకీ కూడ సంక్రమిస్తాయి. ఆ వ్యక్తి సత్త్వరజస్తమో గుణాలు ఆ స్థలాల, వస్తువులలో ప్రతిబింబిస్తాయి.

2735 ప్ర. **అబ్బో! చాల కష్టమే మరి.**

జ. అవును. ఆలయాల్లో, ఇళ్ళల్లో భగవంతుడి సమీపంలో ఉంచిన వస్తువులని పరమ పవిత్రంగా మనం చూస్తున్నామంటే అర్థం భగవత్సామీప్యం ఆ వస్తువుల మీద ప్రభావం చూపినట్లే కద!

**ఒక క్లబ్‌లో జపం, పారాయణ చేయడం కన్నా ఒక ఆలయంలో చేయాలని ఎందుకు సిద్ధపడతాం? స్థల విశేషమునే కదా!**

2736 ప్ర. **'శుచి' అంటే ఇంత అర్థముందా? తుడవడం, తడిగుడ్డ పెట్టి రాయడం లాంటివి చెయ్యడమే 'శుచి' అనుకుంటున్నాను.**

జ. అవెలాగూ చెయ్యాలి. అంతకన్న ముందు చెయ్యవలసినది ఏ స్థలంలో కూర్చుంటామో స్థలం ఎవరిదో తెలుసుకోవడం, ఆ వ్యక్తి స్వభావం నడవడిక తెలుసుకోవడం. ఓనర్ కాక వేరేవారు నిర్వహిస్తూ ఉంటే అదీ తెలుసుకోవాలి.

2737 ప్ర. **ఎలా ఉండాలి అతడు?**

జ. నాస్తికుడవకూడదు ముఖ్యంగా. అంటే వేదమందు విశ్వాసం కలిగి ఉన్నవారయి ఉండాలి. వేదానికి వక్రభాష్యం చెప్పేవారు అయి ఉండకూడదు. వేదంలో చెప్పిన దేవుళ్ళనే ఆరాధిస్తున్నా ఆ దేవుళ్ళు రజస్తమోగుణ ప్రాచుర్యం ఉన్నవారు కాకూడదు. ఆ స్థలం ఓనర్, నిర్వాహకులు కూడ దొంగలు, మోసగాళ్ళు అవకూడదు. అలాంటి స్థలాన్ని ఎంచుకోవాలి.

2738 ప్ర. **చాల కష్టమేమో దొరకడం!**

జ. తనకే సంబంధించిన స్థలమైతే ఇబ్బంది ఉండదు. లేదా నదీతీరం, పర్వత గుహ, దేవాలయం, ఆశ్రమం వంటివి కూడ పనికి వస్తాయి. అయితే మిగిలిన లక్షణాలు - నిశ్శబ్దం, నిర్జనత్వం వంటివి కూడ సరిపోవాలి. పాములు, తేళ్ళు, క్రూరమృగాలు, కోతులు వంటివాటి భయం కూడ ఉండకూడదా స్థలంలో. లేకపోతే మనస్సు వీటి గురించే ఆలోచించెస్తూ ఉంటుంది - ధ్యానం చెడుతుంది.

2739 ప్ర. **తరువాత?**

జ. మరీ ఎత్తుగా లేనిదీ, మరీ దిగువకి అయిపోయినది కానిదీ అయిన ఆసనం వేసుకోవాలి. అది స్థిరంగా ఉండాలి.

2740 ప్ర. **స్థిరంగా ఉండాలని అంటే కదలకూడదని అర్థమా?**

జ. కదలకుండా ఉండడం ఎలాగూతప్పదు - అయితే ఇక్కడ స్థిరత్వం అంటే.... ఆ ఆసనం మెత్తమెత్తగా ఉండకుండా గట్టిగా కఱ్ఱతో చేసినదై ఉండాలి.

2741 ప్ర. **చాలసేపు కూర్చోవాలి కదా! కఠినంగా ఉంటే ఎలా?**

జ. **చేలాజిన కుశోత్తరం** అన్నారుగా! ఒక వస్త్రం - దానిపైన కృష్ణాజినం - ఆపైన దర్భలు ఉంచుకోవాలి. అప్పుడు మెత్తదనం వస్తుంది.

2742 ప్ర. **దర్భలెందుకూ?**

జ. పవిత్రత కోసం. కొన్ని భగవద్గీత గ్రంథాలలో **కుశాజిన చేలోత్తరమ్** అని

కనిపిస్తుంది. అప్పుడు దర్భలు - ఆపైన కృష్ణాజినం - ఆపైన వస్త్రం అని అర్థం.

2743 ప్ర. **వస్త్రం రంగెలా ఉండాలి?**

జ. ప్రత్యేకించి చెప్పలేదు కాని తెలుపు బెస్ట్. సిల్క్‌ది కాకుండా కాటన్‌ది మంచిది. ఇలా తయారయిన దాని మీద కూర్చోవాలి.

2744 ప్ర. **కూర్చోవాలన్న మాట చెప్పేదేముంది?**

జ. ఎందుకవసరం లేదూ? పండుకొని ధ్యానం చేస్తామన్న వారుంటారు. అందుచేత నిలబడి, పండుకొని పనికిరాదని స్పష్టం చేయడానికి 'కూర్చొని' అన్నారు.

2745 ప్ర. **చేరబడవచ్చా గోడకి?**

జ. ఇక్కడ స్పష్టం చేయలేదు కాని నిటారుగా కూర్చోవాలి. చేరబడి కూర్చుంటే సావధానత ఉండదు. అయితే ఇంకో చిక్కు. శరీరం నిటారుగా ఉంచుకోవడానికి ప్రయత్నం చేయడం డిస్టర్బెన్స్ అవుతుంది కనుక నిటారుగా చేరబడి కూర్చోవడానికి వీలైనట్లు సద్దుబాటు చేసుకోవాలి.

2746 ప్ర. **ఇంత ప్రయత్నం అవసరమంటారా?**

జ. అవసరమే నాయనా! గ్లాసు, గ్లాసులో నీరు ఎలా ఉంటాయో అలా ఉంటాయి శరీరము, శరీరంలోని మనస్సూను. నీరు కదిలినప్పుడు గ్లాసు కదలక పోవచ్చును కాని గ్లాసు కదిలితే నీరు కదలక తప్పదు. శరీరం కదలకుండా ఉంచినపుడే మనస్సు యొక్క నిలకడకి అవకాశం లభిస్తుంది.

2747 ప్ర. **ఓహో! ఇప్పుడు మనస్సుని ఏకాగ్రం చేసి చిత్త, ఇంద్రియ వ్యాపారాలని అణచి వేయాలన్న మాట. ఏకాగ్రం అంటే ఏమిటి?**

జ. ఒకే లక్ష్యంతో ఉండడం - ఆత్మదర్శనమే లక్ష్యంగా ఉండడం. చిత్త చాంచల్యాన్ని, ఇంద్రియాల హడావుడిని నొక్కి ఆత్మ దర్శన ప్రయత్నం చేయాలి.

2748 ప్ర. **ఉహూఁ! అర్థం కాలేదు.**

జ. **ఒక తెర కదులుతున్నప్పుడు దాని వెనుక నుండే వస్తువు ఎలా స్పష్టంగా కనిపించదో అలా ఇంద్రియాలు, చిత్తం కదులుతూంటే ఆత్మదర్శనం సాధ్యం కాదు.**

2749 ప్ర. **'ఇంద్రియాలు' కదలకుండా శరీరాన్ని స్థిరంగా ఉంచేంగా?**

జ. శరీరాన్ని స్థిరంగా ఉంచినందువలన అవయవాలు కదలవు. ఇంద్రియాలు మనస్సు దగ్గర కద ఉంటాయి.

2750 ప్ర. **అవును సుమా! అవును సుమా! మరిచిపోయాను. అయితే ఇంక శరీర భాగాలు అలా ఉంచేస్తే సరిపోతుందా?**

జ. చాలదు. ఇంకో రెండు శ్లోకాలున్నాయి 13, 14. విను. సమం కాయశిరోగ్రీవం,

ధారయన్ అచలం స్థిరమ్, సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం, దిశశ్చానవలోకయన్ ప్రశాంతాత్మా విగతభీః, బ్రహ్మచారి వ్రతే స్థితః, మనస్సంయమ్య మచ్చిత్తో, యుక్త ఆసీత మత్పరః॥ అన్వయం విను - **కాయ శిరోగ్రీవం అచలం స్థిరం ధారయన్ దిశః అనవలోకయన్ చ స్వం నాసికాగ్రం సంప్రేక్ష్య ప్రశాన్తాత్మా విగతభీః బ్రహ్మచారి వ్రతే స్థితః మనః సంయమ్య మచ్చిత్తః యుక్తః మత్పరః ఆసీత**

2751 ప్ర. **తాత్పర్యం వివరంగా చెప్పండి ఇదివరకులా!**

జ. సరే! కాయము, శిరస్సు, గ్రీవము - ఈ మూడింటిని సమంగా ఉంచాలి. అంటే నిటారుగా ఉంచాలి.

2752 ప్ర. **ఇది వరకు చెప్పినదే కద! కాని, కాయమంటే శరీరమని అర్థం కద! మళ్ళా శిరస్సు, కంఠము అనెందుకూ చెప్పడం? అవి రెండూ శరీర భాగాలే కద!**

జ. కాయమంటే జనరల్‌గా శరీరమని అర్థమున్నా శరీరమధ్య భాగానికి కాయమని పేరు నిజానికి. దానినే సిద్ధము అని కూడ అంటారు. అందుకని కాయశిరోగ్రీవం సమం అని అన్నారు.

2753 ప్ర. **సరే! అచలమన్నా స్థిరమన్నా ఒకటేగా?**

జ. కాదు. అచలమంటే కదలకుండా ఉంచడం. స్థిరమంటే ఒరిగి పోకుండా ఉంచడం. ఇలా కూర్చొని దిక్కులు చూస్తూ ధ్యానం చెయ్యడం కాకుండా ముక్కు చివర చూస్తూ కూర్చోవాలి.

2754 ప్ర. **మళ్ళా 'ముక్కు చివర' అంటున్నారా? ఇది వరకటి దానినే మీరు వివరించలేదు - ముక్కు ఏ చివరో?**

జ. ఇంకా తెలియలేదా? కనుబొమల మధ్య నున్న చివరని చూడాలి. గాలిని పీల్చే రంధ్రాలున్న చివర కాదు.

2755 ప్ర. **ఎందుకలా?**

జ. బాహ్య వస్తువులు చూడకుండా ఉండడానికే. చూస్తే అవి క్రొత్త ఆలోచనలని రేకెత్తించవచ్చు కనుక.

2756 ప్ర. **కళ్ళు మూసేసుకోవచ్చుగా?**

జ. నిద్రొచ్చేస్తే?

2757 ప్ర. **అయినా యోగంలో మనస్సు అంతర్ముఖమై ఉంటుందిగా!**

జ. అందుకే దృష్టి కనుబొమ్మ మధ్య పడడమే ప్రధానం కాని ముక్కు చివర చూడడం ప్రధానం కాదు. దానికోసం కనుగుడ్లని బలవంతంగా త్రిప్పి కంటి అనారోగ్యాలు తెచ్చుకోనక్కర్లేదు.

2758 ప్ర. **కృష్ణుడు జోకులు కూడ వేస్తాడండోయ్!**

జ. ఇందులో హాస్యం ఏం కనిపించిందోయ్?

2759 ప్ర. **సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం అన్నాడు కదండీ! తన ముక్కు చివరని చూసుకోమన్నాడు. లేకపోతే నాలాంటి వాడు ఎదుటి వాళ్ళ ముక్కు చివరని**

చూస్తూ ధ్యానం చేస్తాడేమోనని ఆయన భయం!

జ. ఊఁ! నీదీ రసహృదయమే! ఇలా కూర్చొన్న తరువాత ప్రశాంతాత్మా - విగతభీః - నిమ్మళమైన మనస్సు, నిర్భయమైన మనస్సు ఉండాలి. బ్రహ్మచర్య వ్రతం తప్పని సరి.

2760 ప్ర. **ఇంత దూరం వచ్చి యోగాసనంలో కూర్చొన్న తరువాత బ్రహ్మచర్యం ప్రస్తావన ఏమిటండీ?**

జ. అవున్నాయనా! స్త్రీ పురుష పరస్పర ఆకర్షణ చాల బలవత్తరమైనది. శారీరకమైన మైధునం కాకపోయినా, మానసికమైన స్మరణ కూడ పనికిరాదు అని నొక్కి చెప్పడానికి వాడేరీ పదాన్నిక్కడ. ఇలా మనస్సుని విషయముల నించి మరల్చి ఉంచాలి.

2761 ప్ర. **అప్పుడేం చేయాలి?**

జ. మచ్చిత్తః, యుక్తః మత్పరః అన్నాడు పరమాత్మ. ఆయన యందు చిత్తమును చేర్చి, సావధానుడై, ఆయననే చింతిస్తూ కూర్చోవాలి.

2762 ప్ర **ఇదేమిటిది? ఆత్మ సాక్షాత్కారం కోసం కదూ ఈ యోగమంతా? మరి పరమాత్మ యందు మనస్సుని చేర్చి కూర్చోవడమేమిటి? ధ్యానంలో ఆత్మ విషయం ఉండనవసరం లేదా?**

జ. నీకు ధనరాశి కావాలనుకో. భగవంతుడ్ని ప్రార్థించాలి నువ్వు ఆ ధనరాశిని పొందాలంటే! ఇప్పుడు చెప్పు సరిగ్గా ఆలోచించి - భగవంతుడ్ని ధ్యానిస్తావా? ధనరాశిని ధ్యానిస్తావా?

2763 ప్ర. **అర్థమైంది. పరమాత్మ వలననే ఆత్మదర్శనం సాధ్యం కనుక పరమాత్మ యందే చిత్తాన్ని చేర్చి ఉంచాలి. అప్పుడేమౌతుంది?**

జ. 15వ శ్లోకం వస్తుంది. **యుంజన్నేవం సదాఽఽత్మానం, యోగీనియత మానసః। శాంతిం నిర్వాణపరమాం, మత్సంస్థాం అధిగచ్ఛతి॥** - అన్వయం **- యోగీ ఏవం సదా ఆత్మానం (మయి) యుంజన్ నియతమానసః నిర్వాణ పరమాం మత్ సంస్థాం శాంతిం అధిగచ్ఛతి** - తాత్పర్యం - ఇలా ఎల్లవుడు మనస్సుని నా యందుంచుతూ అందువలన నిశ్చలమైన మనస్సుని పొందినవాడై సుఖరూపమైన ముక్తిని పొందుచున్నాడు.

2764 ప్ర. **వివరణ కావాలి!**

జ. రెండో అధ్యాయం గుర్తు తెచ్చుకో. అక్కడ ఒక మాట అన్నారు - ఇంద్రియ నిగ్రహం కలుగుతే ఆత్మదర్శనమౌతుందనీ ఆత్మ దర్శనమౌతే ఇంద్రియ నిగ్రహం కలుగుతుందనీను - ఇలా చెట్టు వలన విత్తు - విత్తు వలన చెట్టు అనేది తెగదు కనుక ఇంద్రియములని కొంత నిగ్రహించుకొని నామీద భారం వేయి

మిగిలినది నేను చూస్తాను అన్నాడు పరమాత్మ. దానినే ఇక్కడ మరల చెప్పేడన్నమాట.

2765 ప్ర. **ఓహో! ఆయన యందు నిల్పిననాడు మనస్సనే ఇంద్రియం వశపడుతుందని అర్థమా?**

జ. కృష్ణుడు పరబ్రహ్మ, పురుషోత్తముడు అవడం వలన శుభాశ్రయుడు, శుభాశ్రయత్వం వలన స్పృశించిన ప్రతీదీ పవిత్రం అవుతుంది.

[illegible]
[illegible] ఉండదు.
[illegible]
[illegible]
[illegible]
అవుతుంది. ఏకాగ్రత
లభించిన మరుక్షణంలోనే
ఆత్మదర్శనం సాధ్యం
అవుతుంది. అది ముక్తి.
సుఖరూపమే.

2766 ప్ర. **'మత్ సంస్థాం శాంతిం' అంటే ఇంతేనా?**

జ. ఆయనయందు మనస్సుని నిలపడం వలన వచ్చిన శాంతి అని కూడ చెప్పుకోవచ్చు. **అపహత పాప్మా ....** **అపిపాసః.....** మొదలైన లక్షణములు చెప్పిన ముక్తి అని అర్థం చేసుకోవచ్చు.

2767 ప్ర. **ఏకాగ్రత సాధ్యమైన మరుక్షణంలోనే ఆత్మదర్శన మన్నారు - ఇంక అంతేనా? అయిపోయిందా?**

జ. బలేవాడివే - ఏకాగ్రత భంగమైన క్షణం వెనువెంటనే వెంబడిస్తుంది కద! అప్పుడు మళ్ళా ఆత్మానుభవం ఉండదు. తళుక్కున దర్శనమిచ్చి మాయమైపోయే మెరుపులా ఉంటుందా అనుభవం. ఆ క్షణంలో కలిగిన సుఖప్రాప్తి - సంతోష ప్రాప్తి - ఆనంద ప్రాప్తి - మరల మరల ఆ అనుభవం కావాలని కోరుకుంటూ ఉంటుంది. ప్రయత్నం కొనసాగుతూ ఉంటుంది.

2768 ప్ర. **ఇలా అయితే ఎప్పటికి శాశ్వత ఆత్మానుభవం వస్తుంది?**

జ. శరీరం పడిపోయిన తరువాత.

2769 ప్ర. **అంతవరకు ఇలా యోగం చేస్తూ ఉండడమేనా?**

జ. ఆహా! అంతే కాదు. కొన్ని నియమాలు ఖచ్చితంగా పాటిస్తూ ఉండాలి.

2770 ప్ర. **యోగం చేస్తున్నపుడు పాటించే నియమాలని చెప్పేసేరుగా?**

జ. రోజంతా యోగం చెయ్యవు కద నాయనా? యోగానికి కూర్చొన్నపుడు పాటించవలసిన నియమాలే విన్నావింతవరకు. యోగం నుంచి లేచిన తరువాత మళ్ళా కూర్చొనే వరకు జీవిత విధానం ఎలా ఉండాలో ఆ నియామాలు తెలియవద్దా?

2771 ప్ర. **కర్మయోగ జ్ఞానయోగాలు కొనసాగించడమే కద?**

జ. అదెలాగూ తప్పదు. ఆపైన వివరించబోతున్నారు. యోగానికి

కూర్చోగానే మనస్సు ఏకాగ్రమైపోయి మొదటి సారే ఆత్మదర్శనమైపోదు. ప్రాక్టీస్ చెయ్యగా చెయ్యగా పెర్ఫెక్షన్‌కి వచ్చి అప్పుడు ఆత్మదర్శనం తళుక్కుమంటుంది. అది ఇంకా ఎక్కువ సేపు నిలవడానికి మరల కొనసాగించాలి యోగాన్ని. ఇలా యోగాభ్యాసం చేస్తున్న అన్ని రోజుల్లోను కొన్ని నియమాలు పాటించక తప్పదు.

2772 ప్ర. **చెప్పండయితే!**

జ. **నాత్యశ్నతస్తు యోగోఽస్తి, న చైకాంత మనశ్నతః। న చాతిస్వప్న శీలస్య, జాగ్రతో నైవ చార్జున॥ యుక్తాహార విహారస్య, యుక్త చేష్టస్య కర్మసు। యుక్త స్వప్నావబోధస్య, యోగో భవతి దుఃఖహా॥** - అన్వయం విను- హే **అర్జున! అత్యశ్నతః తు యోగః నాస్తి. ఏకాన్తం అనశ్నతశ్చ న. అతి స్వప్న శీలస్య న. (అతి) జాగ్రతశ్చ న ఏవ. యుక్తాహార విహారస్య కర్మసు యుక్త చేష్టస్య యుక్త స్వప్నావబోధస్య దుఃఖహా యోగః భవతి!**

2773 ప్ర. **తాత్పర్యం సులభమనిపిస్తోంది.**

**మితిమీరి తినేవాడికి, బొత్తిగా తినని వాడికి, అతినిద్రాలోలుడికి, ఎక్కువ మేలుకుని ఉండే వాడికి యోగం కుదరదు.**

తగిన ఆహారము, తగిన విహారము, **తగినంత చేష్ట, తగినంత నిద్ర, తగినంత మెలకువ, ఉన్నవాడికి దుఃఖ నివృత్తిని కలిగించగలిగిన యోగం సిద్ధిస్తుంది. కరక్టేనా?**

జ. కరక్టే. తగిన ఆహారం అంటే అర్థమైందా?

2774 ప్ర. **ఆకలి వేసినప్పుడే తినడం కాని మిగిలిన సమయాల్లో ఖాళీగా ఉన్నామని తినకూడదు. అంతేనా?**

జ ఇంకా ఉంది. ఏకభుక్తం, ద్విభుక్తం అని కూడ కొంతమంది పాటిస్తారు కాని ఇక్కడా అర్థాలు కాదు.

2775 ప్ర. **మరెలా చెయ్యాలి?**

జ. ఓ నాడు ప్రత్యేకించి ఒక ప్రయోగం చేసుకోవాలి. బాగా ఆకలి వేసే వరకు ఆగి, అప్పుడు కొలత చూసుకుంటూ భోజనం చెయ్యాలి. అన్నం, పప్పు, కూర, పచ్చడి, చారు, మజ్జిగ వగైరాలన్నీ ఎంతెంత కొలతలతో తింటున్నామో తాగుతున్నామో ఖచ్చితంగా చూసుకోవాలి. కడుపు బాగా నిండే వరకు తినేయాలి. మధ్యలో నీళ్ళు తాగకూడదు.

2776 ప్ర. **ఆసక్తిగా ఉంది. అప్పుడేం చేయాలి?**

జ. ఇలా ఓవారం రోజుల పాటు చేసే సరికి నీ పొట్టకి ఎంత కొలత గల భోజనం సరిపోతుందో ఏవరేజ్‌ని తెలిసిపోతుంది.

2777 ప్ర. **అయితే?**

జ. ఆ మర్నాటి నుంచి ఆ కొలతలో సగం కొలత మాత్రమే తినాలి. అందులో సగం కొలత నీళ్ళు తాగాలి. అంతే! అదే యుక్తాహారమంటే!

2778 ప్ర. **అమ్మబాబోయ్! అర్ధాకలితో ఉండాలా?**

జ. యోగమంటే ఏమనుకుంటున్నావ్? క్రమంగా అలవాటయిపోతుందిలే! ఓ ఏడాది తర్వాత మళ్ళా కొలత చూసుకోవాలి. అది మొదటి దాని కన్న తక్కువ ఉంటుంది. అందులో సగమే తినడం ప్రారంభించాలి. అందులో సగమే నీళ్ళు తాగాలి.

2779 ప్ర. **మరి నీరసం రాదూ?**

జ. **అస్సలు రాదు. యోగం చేస్తున్న వాడి శరీరం తక్కువ కెలోరీలతో ఎక్కువ పని చేయడానికి అలవాటు పడుతుంది.**

2780 ప్ర. **సరే! వింటేనే నీరసమొస్తోంది నాకు. యుక్త విహారమంటే?**

జ. విహారం అంటే బద్ధకం, కునికిపాట్లు పోవడానికి చేసే సంచారం. అవి పోగానే సంచారం మానేయాలి.

2781 ప్ర. **యుక్త చేష్ఠ అంటే?**

జ. చేష్ఠ అంటే శరీరం పడే శ్రమ. ఎంత అవసరమో అంతే శ్రమ పెట్టాలి తప్ప ఎక్కువ శ్రమ పెట్టకూడదు శరీరాన్ని. పెడితే నిద్రకి దారి తీసి యోగం దెబ్బతింటుంది.

2782 ప్ర. **యోగం ఎంత కాలం జరుగుతుందో అంతకాలం ఇలా ఉండాల్సిందేనా?**

జ. ఖచ్చితంగా! కాని ఒక విషయం యోగసిద్ధి కలుగుతూంటే ఇక ఈ ఆలోచనలే రావుగా! అంతా ఆత్మదర్శన అనుభవంలోనే ఉంటాంగా!

2783 ప్ర. **ఉంటే మాత్రం? అస్సలీ ఆలోచనలు లేకుండా జరుగుతుందా?**

జ. ఒకరంటే ఒకరికిష్టమైన యువతీ యువకులు పరస్పర సుఖాన్ని ఒకమారు పొందిన తరువాత మరల మరల ఆ సుఖాన్ని పొందాలనే తపనతో ఉండడం మనం చూస్తున్నాం కద! ఎప్పుడు అవకాశం దొరుకుతుందా ఎప్పుడా సుఖాన్ని అనుభవిద్దామా అని వారిరువురూ తమ ఇతర కార్యకలాపాల విషయంలో సావధానంగా ఉండనే ఉండరు. అలాగే ఆత్మానుభవం రుచిని యదార్ధంగా ఎరిగిన వారికి ఇక మాటి మాటికి మనస్సు దానియందే తపనతో ఉండి, మిగిలిన విషయాలను నిర్లక్ష్యం చేసేస్తుంది.

2784 ప్ర. **నిజమా?**

జ. యోగం చేస్తున్నా, ఆత్మదర్శనం, అనుభవం అవని వానికి ఆ రుచి తెలియదు కనుక లౌకిక విషయాలైన ఆహార విహార నిద్రాదుల యందు ప్రీతి వదలదు.

2785 ప్ర. **మరి వాడి యోగం ఏమవుతుంది?**

జ. మళ్ళా మళ్ళా బలవంతంగా మనస్సుని లౌకిక విషయాల నుంచి త్రిప్పుకొని కూర్చోవలసిందే! ఒకమారు ఆత్మానుభవ రుచి కలిగి పోయిందా... ఇక ఫర్వాలేదు.

2786 ప్ర. యోగార్హత కొనసాగుతుందంటారా?

జ. 18వ శ్లోకం చూడు. **యదావినియతం చిత్తమ్, ఆత్మన్యేవావతిష్ఠతే, నిస్పృహః స ర్వకామేభ్యో, యుక్త ఇత్యుచ్యతే తదా** - అన్వయం - **యదా చిత్తం ఆత్మన్యేవ వినియతం (సత్) అవతిష్ఠతే తదా సర్వ కామేభ్యః నిస్స్పృహస్సన్ యుక్త ఇతి ఉచ్యతే** - తాత్పర్యం - ఎప్పుడు మనస్సు ఆత్మ దర్శనమే పరమ ప్రయోజనంగా భావనలని కొనసాగించగలదో అప్పుడు మిగిలిన కోరికలన్నీ నశిస్తే యోగార్హుడవుతాడు.

2787 ప్ర. **పరీక్షలు దగ్గర పడిన వాడు తింటూ, తాగుతూ, తిరుగుతూ ఉన్నా పుస్తకాలు చదువుకోవాలనే ఎలా ఆశపడతాడో అలా యోగం నుంచి లేచిన తరువాత తిరిగి కూర్చొనే వరకు అన్ని వేళలా 'మళ్ళీ వెళ్ళిపోవాలి' 'మళ్ళీ కూర్చోవాలి' అనే ఆలోచించాలన్న మాట. బాగుంది. అప్పుడేమౌతుంది?**

జ. 19వ శ్లోకం చూడు. **యథా దీపో నివాతస్థో, నేంగతే సోపమాస్మృతా। యోగినో యతచిత్తస్య, యుంజతో యోగమాత్మనః** - అన్వయం - **నివాతస్థః దీపః యథా న ఇంగతే యతచిత్తస్య యోగం యుంజతః యోగినః ఆత్మనః సా ఉపమా స్మృతా** - గాలి లేని చోట దీపప్రభ కదలకుండునట్లు మనస్సు కదలనపుడు ఆత్మ జ్ఞాన ప్రభ కూడ కదలదు.

2788 ప్ర. **ఇదేదో కొంచెం కష్టంగా ఉంది. కదలకపోవడానికి ఉదాహరణగా ఓ కొండని చెప్పవచ్చు కదా! దీపాన్నెందుకు చెప్పేరు?**

జ. కొండకి ప్రభ ఉండదు. దీపానికే ఉంటుంది. ఇక్కడ దీప ప్రభ నిశ్చలమై ఉన్నదని చెప్పడమే ప్రయోజనం కాని దీపం నిశ్చలమని చెప్పడంకాదు.

2789 ప్ర. **నా కర్థం కాలేదు. ఆత్మదర్శన సమయంలో శరీరం ఇక కదలదు అని సమాధి స్థితిని చెప్తున్నారా?**

జ. కాదు. శరీరం కదలకపోవడాన్ని సమంకాయ శిరోగ్రీవం శ్లోకంలో చెప్పేసేరు.

2790 ప్ర. **ఇంద్రియములు కదలిక లేదని చెప్పడమా?**

జ. **యోగినః సోపమా** అంటూ యోగికి ఉదాహరణగా చెప్పేరు కనుక అదీ కాదు.

2791 ప్ర. **ఆత్మ స్వరూపం కదలదని చెప్పడానికా?**

జ. కాదు. అదెప్పటికీ ఎవరికీ కదలదు యోగం చేసినా చెయ్యకపోయినా ఆత్మస్వరూపం చలించనే చలించదు.

2792 ప్ర. **మరేం చెప్తునాదంటారు?**

జ. ఆత్మస్వరూపం ఒక జ్ఞానం. ఆ ఆత్మ ఇతర వస్తువులని గ్రహించే స్వరూపం ఇంకో జ్ఞానం. మొదటిది ధర్మి జ్ఞానమనీ, రెండవది ధర్మభూత జ్ఞానమనీ పిలవబడతాయి.

2793 ప్ర. **అవును గుర్తొచ్చింది. దీపం, దీపప్రభ లా ఉంటాయా రెండూ అని ఇది వరకు చెప్పేరు మీరు.**

జ. ఇప్పుడు

2794 ప్ర. **ఆత్మదర్శన మంటే ఏమనుకుంటున్నావు? ధర్మి దర్శనమా? ధర్మభూత దర్శనమా? రెండూ కలిపి కాదా?**

జ. రెండింటినీ నువ్వెలాగూ విడదీయలేవు. అది వేరే విషయం. జాగ్రత్తగా ఆలోచించి చెప్పు. ధర్మి అనుభవం కోసం యోగం చేస్తున్నావా? ధర్మభూత అనుభవం కోసం యోగం చేస్తున్నావా?

2795 ప్ర. **సరిగ్గా ఆలోచిస్తే ధర్మభూత అనుభవం ఎప్పుడూ ఉండేదే కద!**

జ. ఎలా?

2796 ప్ర. **దానివలననే కద సమస్తమైన ప్రపంచం గ్రహించబడుతోంది!**

జ. వెరీగుడ్, సమస్తమైన ప్రపంచాన్ని గ్రహిస్తున్నంత సేపు ధర్మభూత జ్ఞానం కదలాడుతూ ఉంటుంది. దీప ప్రభలా.

2797 ప్ర. **ఊఁ!**

జ. ఆపైన ఉన్న మనస్సు, ఇతర ఇంద్రియాలు ఈ ధర్మభూత జ్ఞానం తమలోంచి ప్రసరిస్తున్నపుడు మరిన్ని వికారాలని కలిగిస్తాయి.

2798 ప్ర. **అవును!**

జ. ఇంద్రియాలని దాటి ఆ ధర్మభూత జ్ఞానం అవయవాల్లోంచి వెలికి వస్తూంటే శరీర కదలికల వలన ఇంకా వికారాలు వస్తాయి దానికి.

2799 ప్ర. **రైట్ రైట్ - అర్థమైపోయింది.**

జ. ఏమర్థమైంది?

2800 ప్ర. **శరీరాన్ని స్థిరంగా ఉంచేం - అవయవాల వలన కలిగే వికారం తగ్గిపోయింది. ఇంద్రియాలని నిలిపేం - మనస్సు పవిత్రం చేసి కల్మషరహితం చేసేం - వికారం మరింత తగ్గిపోయింది. ఇప్పుడు ధర్మభూత జ్ఞానం కదలికలని కూడ నిలిపేసేం ప్రపంచ విషయ గ్రహణని మానేసి - దీప ప్రభ కదలడం లేదు.**

జ. అయితే?

2801 ప్ర. **గురువుగారూ! నాచేతే చెప్పిస్తున్నారు. దీప ప్రభ కదలనప్పుడే కద దీప దర్శనం స్పష్టంగా జరిగేది. ధర్మభూత జ్ఞానం కదలనప్పుడే కద ధర్మిజ్ఞాన దర్శనం అనుభవం కలుగుతాయి.**

జ. 'వెరీగుడ్'- మంచిది నాయనా! ఇప్పుడు నీకు తెలిసిపోయింది విషయం. గాలి అంటే మనో వ్యాపారములు. ఇవి కంట్రోల్ అవగానే ధర్మభూతజ్ఞానం బయటికి ప్రసరించే అవసరమే లేదు. ఈ స్థితిలో ధర్మిజ్ఞాన దర్శనం ధర్మభూత జ్ఞానంతో సహా స్పష్టమవుతుంది. "నేను" అనే అనుభవం కలుగుతుంది. అపరిమితం కాకపోయినా మిక్కిలి అద్భుతమైన ఆనందాన్ని పొందుతాం - ఎన్నెన్ని సార్లు దర్శనం సాధ్యమౌతుందో అన్నన్ని సార్లు ఆ ఆనందం మనని

స్పృశిస్తూ ఉంటుంది. ఇది ప్రాకృతమైన అన్ని ఆనందానుభవాల కన్న పైది. సత్యలోక వాసులకి కూడ అందనిది. ఇది సమాధి దశ. మనోవృత్తులిక్కడ ఉండవు. గ్లాస్‌లా పనిచేసిన మనస్సు అద్దంలా పనిచేస్తుందనుకోవచ్చు. మనస్సు ద్వారా బయటికి పరిగెట్టే అలవాటున్న ధర్మభూత జ్ఞానం పరావర్తనం చెందిపోవడంతో ఇక గాలి లేనిచోట నున్న దీప ప్రభలా నిలిచి ఉంటుంది. ఇదే నాయనా చాలమంది చెప్పే మోక్షమంటే -

**ఇదే నాయనా ఎక్కువ మందికి తెలిసిన ముక్తి అంటే - శాంతి మహానందం మాత్రం ఇది కాదు సుమా! ఈ ఆనందానికి గల పరిమితులని కూడ దాటిన మోక్షం, ముక్తి ఇంకా పైన ఉన్నాయి.**

అదీ మహానందం. దాని గురించి ఏడవ అధ్యాయం నుంచి ఎత్తుకోబోతారు. ప్రస్తుతం చెప్పుకున్న దానిని కైవల్యం అని అంటారు. దీనినే లక్ష్యంగా పెట్టుకున్నవారు ఇక్కడితో ఆగిపోతారు. దీనిపైన ఇంకొకటి ఉన్నదని ఎరిగిన వారు తమకి తెలియకుండానే, దీనినొక సోపానంగా చేసుకొని పైకి సాగిపోతారు.

2802 ప్ర. **గురువు గారూ! నాకెందుకో దుఃఖమొస్తోంది.**

జ. ఆనందం ఒక స్థాయిని దాటితే దుఃఖం ద్వారానే వ్యక్తమౌతుందమ్మా! వేదాంతంలో ఒక ముఖ్య ఘట్టాన్ని అవగాహనలోకి తెచ్చుకున్నావు. భగవదనుగ్రహం కలిగినపుడది నీకు తగిన అనుభవాన్నివ్వగలదు.

2803 ప్ర. **ఇంకా ఏమైనా చెప్పండీ అద్భుత ఆనందం గురించి. ఈ కైవల్యం గురించి ఇంకా ఇంకా వినాలనిపిస్తోంది.**

జ. ఈ తృష్ణ కలగడమే ఒక గుర్తు ముందడుగు పడుతన్నదని గ్రహించడానికి. ఆనాడు పరమాత్మ వివరిస్తూ ఉంటే అర్జునుడికి కూడ ఇలానే అనిపించిందేమో! 20, 21, 22, 23 శ్లోకాల్లో చాల ఆదరంతో దీనినే నిరతిశయ పురుషార్థంగా చెప్తున్నారు స్వామి, విను.

2804 ప్ర. **చెప్పండి - శ్లోకాలు నేను చదవనా?**

**యత్రోపరమతే చిత్తం, నిరుద్ధం యోగసేవయా। యత్రచైవాత్మనాఽఽత్మానం, పశ్యన్నాత్మని తుష్యతి॥ సుఖ మాత్యంతికం యత్తత్, బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్। వేత్తి యత్ర న చైవాయం, స్థితశ్చలతి తత్త్వతః॥ యం లబ్ధ్వా చాపరం లాభం, మన్యతే నాధికం తతః। యస్మిన్ స్థితో న దుఃఖేన, గురుణాపి విచాల్యతే॥ తం విద్యాత్ దుఃఖసంయోగ, వియోగం యోగ సంజ్ఞితమ్। స నిశ్చయేన యోక్తవ్యో, యోగోఽనిర్విణ్ణచేతసా॥**

జ. నేరుగా తాత్పర్యం చెప్తాను విను - ఈ యోగము దుఃఖ సంబంధం లేనిది. ఇది నిరతిశయ సుఖమని మనస్సు గ్రహించేది. మనస్సు చేత ఆత్మను చూసేది. ఇతర విషయములను కోరనిది. నిరతిశయ సుఖాతిశయము చేత ఆ స్థితి నుండి చలింప కోరనిది. విరమించిన సమయంలో కూడ దానినే కోరేది - లౌకిక సంబంధ దుఃఖములను నరకు గొననిది. అంతటి గొప్పదీ యోగం. ఫలసిద్ధిలో కొన్త ఆలస్యం జరుగుతున్నా దుఃఖించక చివరి వరకు అభ్యసింపతగినది.

(సశేషం)



భగవద్రామానుజుల ప్రతినిధులైన

పరమహంస పరివ్రాజకాచార్య

## శ్రీశ్రీశ్రీ త్రిదండి అష్టాక్షరీ సంపత్ కుమార

## రామానుజ జీయర్ స్వామి వారి

### డిశెంబరు నెలలో జరుగు కార్యక్రమ వివరములు

ఆలయ నిర్మాణ పర్యవేక్షణ నిమిత్తం డిసెంబరు 1 వ తేదీ నుండి 10 వ తేదీ వరకు కృష్ణాజిల్లా ఉల్లిపాలెంలో వేంచేసి ఉంటారు.

11 వ తేదీ నుండి 15 వ తేదీ వరకు ప్రొద్దుటూరులో వేంచేసి ఉంటారు.

16 వ తేదీ నుండి తాడిపత్రి (అనంతపురం జిల్లా) లో ధనుర్మాస వ్రతం నిర్వహిస్తారు.

మరిన్ని వివరాలకు

శ్రీమత్ అష్టాక్షరీ పీఠం, డో.నెం. 1-3/21-30, గురుకృపా రోడ్, విద్యాధరపురం,
విజయవాడ - 520 012. సెల్ : 92464 56063.



భగవద్రామానుజుల ప్రతినిధులైన

తిరుమల

పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి

**శఠకోప రామానుజ జీయర్ స్వామి వారు**

(పెద్ద జియ్యంగారు)

మరియు

పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి

**శ్రీగోవింద రామానుజ చిన్న జీయర్ స్వామి వార్ల**

(చిన జియ్యంగార్ల)

## డిసెంబరు నెలలో జరుగు కార్యక్రమ వివరాలు

| | |
|---|---|
| 9 | శ్రీ తిరుమంగైయాళ్వార్ల శాత్తుమొర. |
| 10 | శ్రీతిరుప్పాణాళ్వార్ల వర్ష తిరునక్షత్రం. |
| 17 | ధనుర్మాసారంభము |
| 23 | శ్రీతొండరడిప్పొడియాళ్వార్ల వర్ష తిరునక్షత్రం. |
| 25 | తిరుమల శ్రీవారి సన్నిధిన అధ్యయనోత్సవ ప్రారంభము. |

తిరువేంగడముడయాన్ పెరుమాళ్ళ నిత్య కైంకర్యములో ఎప్పటివలె
ఉదయం నుంచి సాయంకాలం వరకు అన్వయించుకుంటూ
పై విశేష కార్యక్రమములలో అన్వయించుకుంటారు.

సత్ సంప్రదాయసంగతులు - 86

# ఆళ్వారుల అమృత వాక్కులు - 13

(గత సంచిక తరువాయి)

శ్రీ ఉ.వే. శ్రీమాన్ ... ఆత్రేయులు గారు, బెంగుళూరు.

**ఇరణ్డామ్ తిరువన్దాది - పూదత్తాళ్వార్**

ఇంతవరకు పొయ్‌కై ఆళ్వారులు (సరోయోగి) అనుగ్రహించిన ముదల్ తిరువన్దాది దివ్య ప్రబంధంలోని నూరు పాశురాలను తేట తెలుగులో అనుభవించి భగవదానంద సాగరంలో మునిగితేలాము. ఈ 'శరణ్య' నుండి పూదత్తాళ్వార్ ప్రసాదించిన **ఇరణ్డామ్ తిరువన్దాది** దివ్య ప్రబంధంలోని నూరు పాశుర పుష్పాలలోని మకరందాన్ని తనివి తీర గ్రోలుదాము. అంతా భగవత్కటాక్షం.




రెండవ తిరువన్దాదిలోని మొదటి పాశురం **అన్పే తకళియ ఆర్వమే నెయ్యాక** అనే పాశురం ప్రసాదించే భగవదనుభవాన్ని మనం ఈ వ్యాస పరంపర మొదట్లోనే ఆస్వాదించాము. శ్రీమన్నారాయణుడే ఆ వర్షాకాలపు చీకటి రాత్రిలో ముదలాళ్వారులు ముగ్గురి మధ్య మెరపులో ప్రత్యక్షమైనపుడు, ఆ దివ్య సాక్షాత్కారానందంలో వారు వడలు మరచి గానం చేసిన ఆ తొలిమూడు మధుర పాశురాలను మనసారా అనుభవిస్తూ, నిత్యమూ 'మంగళా శాసనం'లో అనుసంధించు కుంటున్నాము.

**- శ్రీమన్నారాయణ గుణానుభవం -**

రెండవ తిరువన్దాదిలోని రెండవ పాశురం చాల విశిష్టమైనది.

**జ్ఞానత్తాల్ నన్గుణర్న్దు నారణన్దన్ నామఙ్గళ్ తానత్తాల్ మత్తవన్ పేర్ శాత్తినాల్ - వానత్తణి అమరర్ ఆక్కువిక్కుమతితన్దే నఙ్గల్ పతి అమరర్ కోమాన్ పరిశు.**

దీని తాత్పర్యం ఇది. భక్తి రూపాపన్నజ్ఞానంతో వాస్తవం గ్రహించి శ్రీమన్నారాయణుని గుణ, విభూతులకు సబంధించిన తిరునామాలను భక్తి పరాకాష్ఠలో అనుసంధిస్తే వారిని నిత్య కైంకర్య, సంకీర్తన పరులైన నిత్యసూరుల గోష్ఠిలో పరమాత్మ చేర్చి ఆదరిస్తాడు. **దివివా భువివా మమాస్తువాసః** అని శ్రీ కులశేఖరులన్నట్లు ఈ లోకంలో వినయంతో స్వామి అతిశయాన్ని కీర్తిస్తూ కైంకర్యం చేసేవారే పరమ పదం చేరి స్వామికి దాసానుదాసులై నిత్యకైంకర్య భాగ్యాన్ని పొందుతారు. **పరశునఱుమలరాల్ పాఱ్క ఉలాన్ పాతమ్** అనే మూడవ పాశురంలో పరిమళాలు వెదజల్లే పుష్పాలతో భక్తులు సేవించడానికి వీలుగా పరమపదాన్నుండి పాలకడలికి పయనించి శయనించిన శ్రియఃపతి బ్రహ్మాదిదేవతల కంటే తనపాదాల్ని ఆశ్రయించే సామాన్య శరణాగతులకే సులభుడు అని ఆళ్వార్లు ఆశ్చర్యంతో పొంగిపోతున్నారు. సామాన్య భక్తులకంటే సాధన అనుష్ఠానాల్లో బ్రహ్మాది దేవతలే గొప్పవారు. అయినా వారు పరమపదానికి అంతసులభంగా చేరలేరు. కారణం వారిలో భగవానుడే ఉపాయం అనే విశ్వాసం పరిపూర్ణంగా లేకపోవడమే. అతడు మనకు సర్వవిధ బంధువు,

మన రక్షణ భారం అంతా అతనిదే అని నమ్మి నిశ్చింతగా నుండే ప్రపన్నులకే ఆయన పరమపురుషార్థాన్ని అందిస్తాడు. అదే ఆశ్చర్యం!

**నకరిశైత్తు నిత్తిలత్తు నాణ్మలర్ కొణ్ణు** అనే నాల్గవ పాశురంలో ఆళ్వార్లు ఏ విధంగా భగవంతుని ఆశ్రయించాలో అందంగా శాయిస్తున్నారు. నా స్వామికి వాసయోగ్యమైన గొప్పనగరంగా నా మనస్సును మలుచుకుంటాను. దానిలో అప్పుడే విరిసిన పూవురేకుగా ముత్యం వంటి నా స్నేహాన్ని అమరుస్తాను. సంగం అనే మాణిక్యాన్ని కామం అనే వజ్రాన్ని ఆ తామర పూవు లోని కేసరాలుగా, పుప్పొడిగా చేసి వాటిని భగవత్‌పరం చేస్తాను. సాటిలేని భక్తి అనే ఆ అరవిందాన్ని ధరిస్తాను. ఆ పూవులో వక్షఃస్థలంలో కుడివైపున లక్ష్మిని కలిగి ఉన్న శ్రీమన్నారాయణుని శ్రీపాదాలను సేవిస్తాను.

**అడి మూన్ఱి వ్వులకమ్ అన్దళన్దాయ్ పోలుమ్** అనే అయిదవ పాశురంలో, ఆ మహాబలి నుండి మూడడుగుల నేలను యాచించావు. నీ శ్రీపాదాలతో మూడు లోకాలను కొలిచావు! నీ పరత్వాన్ని సౌలభ్యాన్ని ఎవరు తెలుసుకోగలరు? స్వామి! అంటున్నారు ఆళ్వార్లు. **అరినైన్దు ముళ్ళడక్కి అయ్‌మలర్ కొణ్ణు** అనే ఆరవ పాశురంలో పంచేంద్రియాలను నియమించి అనగా అన్య విషయాలలో ఆసక్తిని తగ్గించే విధంగా నియంత్రించి భగవద్విషయంలో ప్రావణ్యము కలిగి ఉండేట్లు

## పంచాంగం

### డిసెంబరు 2011

06 సర్వేషాం ఏకాదశి, గీతాజయంతి

09 శ్రీ తిరుమంగై ఆళ్వార్ల తిరునక్షత్రం, కృత్తికా దీపోత్సవము, ప్రబంధ నిగమనం

10 శ్రీ తిరుప్పాణియాళ్వార్ల తిరునక్షత్రం, గృహముల యందు ప్రబంధ నిగమనం, సంపూర్ణ చంద్రగ్రహణం.

16 ధనుస్సంక్రమణము, ధనుర్మాసవ్రతారంభము

21 సర్వేషాం ఏకాదశి

23 శ్రీ తొండరడిప్పొడియాళ్వార్ల తిరునక్షత్రం

24 అమావాస్య

చేసి స్వామికి పూలను పరిశీలించి సమర్పిస్తూ, స్వామికి తమకు ఉండే శేష శేషి సంబంధాన్ని బాగుగా ఎఱిగి భగవానుడి తిరునామాలను ఎల్లప్పుడు అనుసంధిస్తూ, కీర్తించే మహాభాగ్యశాలురు సముద్రవర్ణుడైన స్వామి చరణాలను దర్శించి, తరించగలరు అని అభయ ప్రదానం చేస్తున్నారు.

**కళల్ ఎడుత్తు, వాయ్ మడిత్తు కణ్ శుళన్డు మాత్తార్** అను ఏడవ పాశురంలో, సముద్రం వలె అతిగంభీరమైన ఓ మనసా! పూర్వం స్వామి త్రివిక్రమావతారాన్ని ఎత్తినపుడు తన పాదాలను పైకెత్తి తన నెదిరించిన శత్రువులలో భయకంపాన్ని కలిగించేట్లు దవుడల్ని మడిచి, కన్నులను గుండ్రంగా త్రిప్పుతూ నిప్పులు చిమ్మే సుదర్శనాన్ని, ధరించి పోరు సాగించే ఆ స్వామి శ్రీపాదాలను శిశువు తల్లి స్తన్యానికి ఆశపడినట్లు ఆశ్రయించి తరించు అని ఆళ్వార్లు ఉపదేశిస్తున్నారు. చంటి బిడ్డకు తల్లి పాలవలె స్వామి పాదాలు మధురాశ్రయాలు.

**ఉకన్దునైవాంగి ఒళినిరంగొల్‌కొంగై** అనే ఎనిమిదో పాశురంలో, భగవానుని పాదాలను ఆశ్రయించేప్పుడు ఏవైనా ఆటంకాలు వస్తేనో అంటే, తనను శరణాగతి చేసిన వారి ఆటంకాలను పూతనను అంతమొందించినట్లే తొలగిస్తాడు. మనం చేయవలసిదల్లా ఒక్కటే! పూతన లాగా కపట ప్రేమను ప్రదర్శించకుండా, అకుంఠిత భక్తితో ఆశ్రయించాలి.

**- నిజమైన ప్రేమకు నిధానం -**

పూతన ప్రేమ కల్పితం. దానికి దుఃఖమే పర్యవసానం. దాని వల్ల పొందిన నిర్వేదం ఉపశమించాలంటే ఏం చెయ్యాలి? సాటిలేని

యశోదాదేవి ప్రేమను తలుచుకోవాలి.

**అన్దతుక కణ్ణజ్ఞాత అయ్చ్చియునక్కిరజ్జి నిన్నుముల్లె తన్ద నిన్నిర్మైక్కు - అన్ను పరన్ ముత్తైయాల్ నీ అళన్ద మాకడల్ శూళ్ ఞాలమ్ పెరుముత్తైయాలెయ్దు మోపేర్తు** తెనుగులో ఈ తొమ్మిదవ పాశురం ఇలా ఉంటుంది.

అనాడు కన్నయ్యకు స్తన్యమిచ్చి చచ్చి పడిన పూతనను చూచి యశోదమ్మ భయపడిందా? అమ్మో! నా బిడ్డకు పాలిస్తే నేనూ ఆ పూతన లాగానే తనువు చాలిస్తానా? అని ఆ తల్లి ఎన్నడైనా అనుకున్నదా? లేదే! అత్యంత వాత్సల్యంతో అమెతన పిల్లవాడికి పాలివ్వలేదా? ఆమె గొప్ప వాత్సల్య గుణానికి సముద్రం చేత అభినందించబడిన ఆ భూమాతైనా సాటిరాగలదా? అని ఆళ్వార్లు ఆనందిస్తున్నారు. పోనీ, ముల్లోకాలను అవలీలగా కొలిచిన స్వామి గొప్పదనం యశోదాదేవి వాత్సల్య గరిమకు సాటివస్తుందా? ఆ తల్లి ప్రేమాతిశయాన్ని వర్ణించడం ఎవరి తరం?

**అల్పప్రేమ, స్వల్పభక్తి**

**పేర్తనై మాశకడమ్ పిళ్ళియాయ్ మట్ ఇరన్దు కాత్తనై పల్లురుమ్ కావలనే- ఏత్తియ నావుడైయేన్ పూవుడైయేన్ నిన్నుళ్ళి - నిన్దమైయాల్ కావడియేన్ పట్టకడై** ఈ పదవ పాశురం తాత్పర్యం ఇది యశోదవలె నీ మీద అంత గొప్ప ప్రేమ నాకు లేక పోయినా, అల్పమైన ప్రేమ, స్వల్పమైన భక్తి ఉంది. ఇంతవరకు ఎన్నో జన్మలలో నేను, నాకు కనిపించిన దేవుళ్ళ నందరినీ ఉచ్చం నీచం పాటించక వారి కాళ్ళలో నా తలదూర్చి దీనాతి దీనంగా వేడుకున్నాను. అయినా, స్వామీ! ఈ జన్మలో నీపై ప్రేమ, భక్తి కొంచమైన చూపగలుగు తున్నాను. నా పూర్వ జన్మల పాపాలను పోగొట్టి నన్ను రక్షించగల దైవానివి నీ వొక్కడివే! అనాడు బండిపై పూనిన రాక్షసుని, నీ చిన్ని కాలు చాచి అంతమొదించావు గద! బలి వద్ద యాచించి భూమిని పొంది, నీ శ్రీపాదంతో ముల్లోకాల్లోని జీవాత్మలకు కాపాడావు గదా! నిన్ను కీర్తించి పూజించే ప్రేమను, భక్తిని నేను కలిగివున్నాను నీవు చక్రవర్తివి. ఇక నీ దాసులవంటి అన్య దేవతలతో నాకేమి పని? నన్ను పాలించు తండ్రీ

(సశేషం)

## గమనిక

శరణ్య పత్రికలో ప్రచురితమవుతున్న ప్రకటనలు, సంబంధిత ప్రకటన కర్తలు ఇచ్చిన సమాచారం మేరకే ప్రకటించుట జరుగుచున్నది. అట్టి ప్రకటనలపై గాని, ప్రకటన కర్తలతో గాని శరణ్య పత్రికకు ఏ విధమైన సంబంధము లేదు. పాఠకులు స్వంత నిర్ణయంపై ప్రకటన కర్తలను సంప్రదించవలెను. ప్రకటనల విషయంలో శరణ్య పత్రికకు ఎటువంటి బాధ్యత లేదు. ఉత్తర ప్రత్యుత్తరాలు అనుమతించబడవు.

- సెక్రటరీ

శ్రియైనమః | శ్రీమతే రామానుజాయనమః | Mobile : 94406 50664

His Holiness



# SRI TRIDANDI SRI KRISHNA YATHINDRA RAMANUJA JEEYAR SWAMY

SRI GEETHA ASHRAMAM, H.No.10-1-651, SANTHOSHNAGAR, KARIMNAGAR - 505 001 (A.P).

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

## శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీకృష్ణయతీంద్ర రామానుజ జీయర్ స్వామి

శ్రీ గీతా ఆశ్రమము, ఇ.నెం. 10-1-651, సంతోష్‌నగర్, కరీంనగర్ - 505 001

## భక్తి జ్ఞాన వైరాగ్యములను పెంపొందించే ఆధ్యాత్మిక గ్రంథాలు

| | | |
|---|---|---|
| 1. | యదార్థమానవత్వము (మానవ జీవిత పరమార్థాన్ని ప్రబోధించే గ్రంథము) | వెల రూ॥ 30/- |
| 2 | స్త్రీ ధర్మ ప్రబోధిని (గృహిణి ధర్మమును తెలుపునది) | వెల రూ॥ 25/- |
| 3 | గద్యత్రయమ్ - తెలుగు వ్యాఖ్య (రామానుజుల విశేష రచన) | వెల రూ॥ 30/- |
| 4 | ధనుర్మాస వ్రతము (తిరుప్పావు - వ్రత విధానము) | వెల రూ॥ 20/- |
| 5 | శ్రీమద్భగవద్గీత (సులభ శైలిలో తాత్పర్యంతో) | వెల రూ॥ 20/- |
| 6 | శ్రీ విష్ణు నామామృతము (సహస్రనామాలకు సరళమైన వ్యాఖ్య) | వెల రూ॥ 45/- |
| 7 | భగవద్రామానుజ చరిత్ర (సంపూర్ణ చరిత్రాంశములతో) | వెల రూ॥ 25/- |
| 8 | గోవింద దామోదర స్తోత్రం (కృష్ణ భక్తిని మేలుకొల్పునది) | వెల రూ॥ 15/- |
| 9 | యతిరాజవింశతి (రామానుజుల విశిష్టత తెల్పునది) | వెల రూ॥ 5/- |
| 10 | భజగోవిందం - భజయతిరాజం (మోహాన్ని తొలగించునది) | వెల రూ॥ 5/- |
| 11 | సంక్షేపరామాయణం (తెలుగులో సంగ్రహ రామచరిత్ర) | వెల రూ॥ 6/- |
| 12 | భగవద్రామానుజ వైభవమ్ (రామానుజుల ముఖ్యోద్దేశ్యాలు) | వెల రూ॥ 6/- |
| 13 | శ్రీరంగనాథ శతకము (శ్రీరగనాథుని వైభవము) | వెల రూ॥ 5/- |
| 14 | ముకుందమాల (మధురమైన భక్తి స్తోత్రము - తెలుగుతో) | వెల రూ॥ 5/- |
| 15 | స్తోత్రమంజరి (ముఖ్యమైన స్తోత్రములు) | వెల రూ॥ 10/- |
| 16 | చాణక్యనీతి (విజయవంతమైన జీవితం కొరకు) | వెల రూ॥ 20/- |
| 17 | శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రం (మూలము) | వెల రూ॥ 3/- |
| 18 | శ్రీకృష్ణస్తుతి (పద్యకావ్యము) | అమూల్యం |

ప్రతులకు : మేనేజర్
శ్రీగీతా ఆశ్రమము
ఇ.నెం. 10-1-651,
సంతోష్‌నగర్, కరీంనగర్.

**నోట్**

- రిజిష్టరు పోస్టులో పంపుటకు రూ॥ల 20/- అదనం.
- బుక్ పోస్టులో పంపుటకు (ప్రతి పుస్తకానికి) రూ॥లు 6/-
- ఒక వేయి రూపాయల విలువ లేదా ఆపైగల ఆర్డరుకు 20% డిస్కౌంటు ఇవ్వబడును.

SRIMATHE RAMANUJAYA NAMAHA

***With Best Compliments***

FROM:



## SRI SRI SRI KRISHNA YATHINDRA RAMANUJA JEEYAR SWAMY


THE FOUNDER OF SRI VISHISHTADWAITHA PEETAM,
SRI GEETHA ASHRAMAM, H.No.I0-I-651, SANTHOSH NAGAR,
KARIMNAGAR— 505 001 (A.P), Mobile : 94406 50664
Email:krishnayathindrajeeyar@gmail.com


Sri Swamyji has launched the propagation of Bhakthi and Prapathi Preached by SRI BHAGAVAD RAMANUJACHARYA, the jagadguru of Sri Vaishnava Siddhantam, equally for all people for the welfare of their janma; in the same line SRI KRISHNA YATHINDRA JEEYAR SWAMY has published the following spiritual and sampradaya books in Telugu and Freely distributing among the needy people of A.P., particularly in TELANGANA region:

1 **YATHARTHA MANAVATVAM :-** Telugu commentary on important chapters of BHAGAVAD GITA.

2 **STHREE DHARMA PRABODHINI :-** Sanathana Dharma and qualities of Bharatiya Gruhini (house wife).

3 **GADHYA THRAYAM :-** Bhagavad RAMANUJACHARYA' S Noble work. Translated into Telugu, for all the Devotees of Sri Vaishnava Sampradayam.

4 **SRI VISHNU NAMAMRUTHAM :-** A detailed and sarala vyakhyanam in Telugu for the VISHNU SAHASRANAMA STHOTRAM (name wise).

5 **BHAGAVAD RAMANUJA CHARITHRA :-** Complete history of BHAGAVAD RAMANUJA CHARYA, in Telugu.

6 **BHAGAVAD RAMANUJA VAIBHAVAM :-** A brief history and important works of RAMANUJA CHARYA.

7 **DHANURMASA VRATHAM :-** Translation into Telugu for ANDAL' S TIRUPPAVAI, and several hints for dhanurmasa vratham.

8 **BHAJAGOVINDAM & BHAJAYATHIRAJA STHOTHRAM :-** A translation into Telugu poems for easily readable for all people.

9 **BHAGAVAD RAMANUJA UPADESHA RATNALU :-** A pocket book in Telugu, containing the 82 main upadesha sukthulu of SRI RAMANUJA.

10 **SANKSHEPA RAMAYANAM :-** A translation in poems of" 1st sarga" of SRIMAD RAMAYANAM i.e., brief history of SRI RAMA.

11 **RAMAYANA UPADESHA RATHNALU :-** Selected sukthis preached by SRI RAMA, in several occasions.

12 **YATHIRAJA VIMSATHI :-** SRI MANAVALAMAMUNI'S sthothram translated into Telugu.

13 **MUKUNDAMALA :-** SRI KULASEKHARA' S sweet and sedative sthothram translated into Telugu version.

14 **SRI RANGANATHA SATHAKAM :-** Telugu poems 108 containing SRI RANGANATHA sthuthi.

15 **CHANAKYANEETHI :-** SRI CHANAKYA'S neethi, about family, samajika, personal relations etc.

16 **GOVINDA DAMODARA STHOTHRAM :-** Translated into Telugu poems, which is very sweeter (madhura) Bhakthi sthothram.

For the above Books : Contact, MANAGER
**SRI GITA ASRAMAM**
H.No. 10-1-651, Santhoshnagar, Karimnagar - 505001.

# అమలనాదిపిరాన్

## వ్యాఖ్యానవివరణమ్

(గత సంచిక తరువాయి)

శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీ భాష్యం శ్రీనివాసాచార్యులు గారు, హైదరాబాదు.

**తుణ్డవెణ్బిఱై యన్తుయర్ తీర్త్తవన్ అఞ్జిఱైయ**
**వణ్డువాழ் పొழిల్ శూழరఙ్గనగర్ మేయ వప్పన్**
**అణ్డరణ్డబగిరణ్డత్తొరు మానిలమ్ ఎழுమాల్వరై ముற்றుమ్**
**ఉణ్డకణ్డమ్ కణ్డీ రడియేనై యుయ్యక్కొణ్డదే**

ప్రతిపదార్థం : **తుణ్డమ్** - ఒక ముక్క అయిన (కళామాత్రమైన), **వెణ్బిఱైయన్** - తెల్లని చంద్రుడిని (జటమీద) ధరించిన శివుడి, **తుయర్** - (బిచ్చం అడుక్కుని తిరుగుతూండే) పాపాన్ని, **తీర్త్తవన్** - పోగొట్టిన వాడును, **అమ్శిఱైయ వణ్డు** - అందమైన తెక్కలుగల తుమ్మెదలు, **వాழ்** - జీవించుతున్న స్థలమైన, **పొழిల్ శూழ்** - తోటల చేత చుట్టబడిన, **అరఙ్గమ్ నగర్** - శ్రీరంగ మహా నగరంలో, **మేయ** - చక్కగా అమిరి ఉన్న, **అప్పన్**- స్వామియైన శ్రీరంగనాథుడి, **అణ్డర్** - అండంలో ఉన్న చేతనుల, **అణ్డమ్** - ఈ అండాన్నీ, **బగిరణ్డమ్**- బైటనున్న అండాలనీ (వీటిని ధరించి ఉండడం వల్ల) **ఒరుమానిలమ్** - అద్వితీయమైన మహాపృథ్విని **ఎழுమాల్వరై** - ఏడు కుల పర్వతాలనీ, **ముற்றుమ్**- చెప్పి చెప్పకుండానూ ఉన్న మిగతా వాటినన్నింటినీ **ఉణ్డ** - ఆరగించిన, **కణ్డమ్ కణ్డీర్**- ఆ దివ్యమైన కంఠం గద **అడియేనై**- దాసుడినైన నన్ను, **ఉయ్యక్కొణ్డదు**- ఉజ్జీవింపజేసింది.

పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యాన వివరణం.

**అవతారిక** : సమస్తలోకాన్ని ప్రళయ కాలంలో తనకడుపులో ఉంచుకొని రక్షించిన శ్రీరంగనాథుడి కంఠసౌందర్యం నన్ను సత్త గలిగిన వాడిగా చేసింది అంటున్నారు ఈ పాశురంలో. అలా కాకుండా, వెనకటి పాశురంలో అనుభవించబడిన వక్షస్థల సౌందర్యం కంఠ సౌందర్యంలో ములిగిపోయిందని కూడ చెప్పుకోవచ్చు.

**వ్యాఖ్యానం** : **తుణ్డవెణ్బిఱైయన్ తుయర్ తీర్త్తవన్** పూర్తిగా ఉన్నది కాకుండా ఒక చిన్న చంద్రవంకగా నున్న చంద్రుడై తెల్లగా ఉండే చంద్రకళని తలమీద ఉన్నవాడైన రుద్రుడు, తన తండ్రీ, లోకాన్ని సృష్టించే వాడూ అయిన బ్రహ్మగారి శిరస్సుని నరికేయడం వల్ల వచ్చిన పాపాన్ని పోగొట్టిన వాడు. బరువుని విసిరిపారేసి వెళ్ళేవాళ్ళు బరువుకి కిందనున్న సుమ్మచుట్టలో ఉన్న తాటాకుని చుట్టగా పెట్టినట్లుగా, పరమాత్మని గురించే తపస్సు చేసేవాడు అనిపించేటట్లు జటని ధరించినవాడై ఉన్నా అందం మీద ప్రీతితో దృష్టి పెట్టినవాడు అనిపించడానికి చంద్రకళని తలమీద పెట్టుకున్నాడు. అలా ఉన్నప్పటికీ బ్రహ్మశాపం వల్ల బిచ్చం ఎత్తుకుంటూ తిరగడం అనే ఆపత్తు వచ్చినప్పుడు అది పోవడానికి సర్వేశ్వరుడిని శరణు పొందవలసి వచ్చింది. **తుణ్డవెణ్బిఱైయన్** - అన్న పదానికి

బ్రహ్మశాపం వల్ల బిచ్చం ఎత్తుకుంటూ తిరగడం అనే ఆపత్తు వచ్చినప్పుడు అది పోవడానికి సర్వేశ్వరుడిని శరణు పొందవలసి వచ్చింది.

రుద్రుడని అర్థం చెప్పుకోకుండా ఏకకళామాత్రుడైన చంద్రుడనే అర్థం చెప్పుకోవాలి. భార్యగారి దగ్గర పక్షపాతంతో వ్యవహరించినందువల్ల శపించబడిన చంద్రుడి వంకని తీర్చినట్లుగా తమ పాపాన్ని కూడ పోగొట్టేవాడని అర్థం.

**అణ్ణైయ వణ్డువాழ் పొழిల్ శూழ் అరఙ్గనగర్ మేయ అప్పన్** - లోకంలో గొప్పదనాన్ని పొందిన దేవుడైన రుద్రుడు బ్రహ్మతలని కోసేసి బ్రహ్మహత్యాదోషాన్ని తెచ్చుకొని గాభరాపడుతూ తిరిగినప్పుడు తాను పరమపదమనే చేరశక్యంగాని చోట ఉండకూడదని వీళ్ళని కాపాడడానికని ఇక్కడున్న శ్రీరంగం వచ్చి కన్ను మూసుకుని కటాక్షించడానికి ఎదురు చూస్తూ సర్వలోకపితగా ఉన్నవాడు" అన్నది ఈ మాటలకి అర్థం.

**వణ్డు వాழ் పొழిల్ శూழ்**- అని శ్రీరంగానికి విశేషణాన్ని పెట్టడం వల్ల తుమ్మెదలు ఎంబెరుమానుడి దాకా వెళ్ళ సాధ్యం గాక దివ్యమైన తోటల మాధుర్యానికి వశపడి ఆ ఇసుకలో పాదగబడినట్లు అందులోంచి వెనక్కిరాలేక అక్కడే ఉండడాన్ని చూపిస్తోంది. ఇలా మొదటిరెండు పాదాల వల్లా, తమని ఆ తుమ్మెదల్లా తన విషయంలో అభినివేశం కలిగేటట్లు చేసి, తమ కోరికని తీర్చేడు అంటున్నారు.

**అణ్డరణ్డ బగిరణ్డత్తు ఒరువమానిలమ్ ఎழ்మాల్వరై ముற்றுమ్ ఉణ్ - కణ్డమ్ - కణ్డీర్ - అణ్డరణ్డమ్** - ఈ అండంలో ఉన్న వాళ్ళు బ్రతికే స్థలమైన బ్రహ్మాండం. **బగిరణ్డమ్** - అన్నది బాహ్యమైన అండం. అండానికి బైటున్న సాటిలేని

మహాస్థలం. ఎ(ట్రుమల్‌వరై భూమి స్థిరంగా ఉండడానికి మేకు కొట్టినట్లుగా ఉన్న ఏడు కులపర్వతాలనీ ఒక్కదాన్నీ వదలకుండా వేసవి ఎండగాడ్పులకి బూరుగుచెట్టు పత్తిలాగ వ్యాపించి స్వామి కుక్షిలో ప్రవేశించినట్లుగా ఆరగించినది ఈ కంఠమే గదా! వీటిని వేరువేరుగా చెప్పడానికి కారణం ఏమిటంటే, ఒక్కొక్కటిగా చెప్పడం చాల ఇష్టమై ఉండడమే కారణం. పెరియపెరుమాళ్ళ కంఠాన్ని చూడగానే ప్రళయకాలంలో సమస్త ప్రపంచాన్నీ తెచ్చుకొని తనకడుపులో దాచిపెట్టి రక్షించుకున్న మహాకార్యం తల్చుకున్నారు. కుట్టు ఉన్న చెవిని చూసినప్పుడు ఈ చెవికి కర్ణాభరణం పెట్టుకొని ఇలా పెద్దకుట్టైపోయింది గదా అని జ్ఞాపకానికి వచ్చినట్లన్న మాట.

**అడియేనై ఉయ్య క్కొణ్డదే** - ఇది వరకు లభించిన కైంకర్యానికి ఆటంకం రాకుండా రక్షించింది. నన్ను ఈ లోకంలో బ్రతుకనే సుడిలో ఒక్క రోజు కూడ చిక్కుకోకుండా చేసింది. ఈ పాశురం వల్ల ప్రళయకాలంలో సమస్తలోకాలనీ ఆరగించి తన కడుపులో పెట్టుకొని రక్షించిన సర్వేశ్వరుడి స్వభావం పెరియపెరుమాళ్ళకి ఉన్నదని అంటున్నారు.

**ఆరో పాశురానికి అగియమణవాళప్పెరుమాళ్ నాయనార్ వ్యాఖ్యాన విశేషాలు.**

వ్యాఖ్యానం : **తుణ్డవెణ్‌పిఱైయన్** అనడం వల్ల చంద్రుడనే ఒక దైవాన్ని ఆభరణంగా కలిగి ఉండడం వల్ల వచ్చిన గొప్పదనం, భోగంలో అభిరుచి ఉన్నవాడు అనిన్నీ, మోక్షం పొందాలి అని కోరిక ఉన్న వాడుకాడనీ చెప్పబడుతోంది.

**వెణ్‌పిఱైయన్ తుయఱ్‌తీర్తవన్** - ఏనుగికి తగినంత వాతనొప్పి అన్నట్టుగా లోకానికంతకీ

మంచి కలిగించేవాడు గనుక శంకరుడని పేరుపొందిన వాడికి వచ్చిన కష్టం గనుక చాల పెద్ద దుఃఖం అయింది. ఇతని తండ్రి గనుక వీడి గర్వం అణచడానికి నువ్వు చిదిపేసిన నాతల నీచేతికి అంటుకుపోయి, దాంతో మూడు లోకాలు తిరుగుతూ బిచ్చం ఎత్తుకుందువు గాక అని బ్రహ్మ శపించేడు. **ముడైయడర్త్త శిరమేన్ది మూవులగుమ్ పలితిరివోన్ ఇడర్కెడుత్త తిరువాళన్ ఇణైయడియే అడై నెఞ్జే!** కంపు కొడుతున్న శిరస్సు పట్టుకొని మూడు లోకాలు బిచ్చం కోసం తిరిగేవాడి కష్టాన్ని తీర్చిన శ్రియఃపతి శ్రీపాదాలనే చేరవే ఓ మనసా! (పెరియ తిరు6-9-1) అని పిరాట్టీ స్వామీ కలిసి వచ్చి వాడి దుఃఖాన్ని తీర్చిన కథని చెప్పున్నారు.

**వణ్డువాళ్ పొళిల్** - వణ్డుగళ్ అని స్వాపదేశంగా మంచి జ్ఞానం, మంచి అనుష్ఠానం అనే రెండు తెక్కలతో ఉన్న సాత్వికులని చెప్పడం జరిగింది. **వణ్డు వాళ్ పొళిల్ శూళ్ అరఙ్గనగర్** - పెరియపెరుమాళ్ళకి ఆభరణమై ఉండే తోట. తోటకి ఆభరణమైన తుమ్మెదలు, తుమ్మెదలకి ఆభరణమైన అందమైన తెక్కలు.

**ఆరోపాశురానికి మునివాహన భోగ వివరణం.**

**అవతారిక :** వెనకటి పాశురంలో కైంకర్యాన్ని ఆపేక్షించే తమకి ఆ కైంకర్యానికి ఆటంకంగా ఉండే "నేనే స్వామిని" అనే అహంకారాన్నీ, దానికి కారణమైనవాటినీ, సర్వేశ్వరుడు పోగొట్టిన విధాన్నీ సాయించేరు. ఈ పాశురంలో ఐశ్వర్యం కోరుకొనే రుద్రుడి వంటివాళ్ళకి ఐశ్వర్యానికి ఆటంకం అయిన భిక్షాటన చేసి కడుపు నింపుకోవడం అనే

అవలక్షణాన్ని పోగొట్టిన వృత్తాంతాన్ని చెప్తున్నారు.

వ్యాఖ్యానం : **తంఞ్జవెణ్ పిఱైయుమ్ తుయరత్తీర్తవన్** - ఈశ్వరుడనే పేరుమోస్తూ తనకీ నిజమైన పూర్తిలేదనే విషయం జ్ఞాపకం చేస్తున్నట్లుగా, చంద్రవంకని ధరించిన రుద్రుడు బ్రహ్మకుమారుడుగా ఉండడం, తండ్రిగారైన ఆయన తలని గిల్లివేసి తప్పుచేసి దానివల్ల పితృ హత్య అనే మహాపాపం వల్ల పీడింప బడుతున్నవాడై, చేతిలో అంటుకు పోయిన బ్రహ్మ కపాలాన్ని మోసుకుంటూ "ఈ పాపాన్ని పోగొట్టగలిగినవాళ్ళె వళ్ళు" అని ఏడు లోకాలూ చుట్టు తిరిగి, ఓడ రేవు చేరినట్టు కరుణా సముద్రుడైన ఎంబెరుమానుడిని చూసి, **ఎన్ ఎన్దాయ్ శాబమ్ తీర్** - నా తండ్రీ!శాపం తీర్చు (పెరియ తిరు1-5-8) అని ఆయనని ప్రార్థిస్తే, ఇతని శాపాన్ని తీర్చగలిగినవాడు. దీనివల్ల ఈశ్వరుడు అన్న పేరున్న రుద్రుడు కర్మవశ్యుడే అనిన్నీ, తనికి ఒక కష్టం వచ్చినప్పుడు తనని తాను రక్షించుకోలేని వాడు మిగతావాళ్ళని తిన్నగా రక్షించలేనివాడన్నదీ, పరేశ్వరుడే అందరి కష్టాలనీ తీర్చగలిగినవాడు అన్నదిన్నీ స్పష్టమైంది.

**అఞ్జిఱైయ వణ్డువాళ్ పొయ్గైగళ్ శూళ్ అరఙ్గనగర్ మేయవప్పన్** - బాధపడుతున్న వాళ్ళు కావాలంటే వాళ్ళకోసం రాయబారం వెళ్ళడానికి, **విణ్డోర్ పిరానార్ మాశిల్ మలరడిక్కీళ్ ఎమ్మై చ్చేర్విక్కుమ్ వణ్డుగళే** - నిత్యసూరి నాయకుడు గారి మచ్చలేని శ్రీపాదకమలాలవద్దకి మమ్మలని చేర్పించే తుమ్మెదల్లారా (తిరువిరుత్తమ్ - 54) అని వాళ్ళని చేర్చవలసిన చోటికి చేర్చడానికి కారణమైన వ్యాపించడానికి సాధనాలై, సుందరంగా

ఉండేవైన తెక్కలున్న తుమ్మెదలు, వాటి రాణీ తుమ్మెదలతో బాటు ప్రీతితో జీవించే అందమైన నందనవనాల చేత చుట్టబడిన శ్రీరంగ మహానగరంలో ఎప్పుడూ హాయిగా జీవించే సమస్త లోకాలకీ తండ్రైనవాడు. ఈ వాక్యం లోకానికి కారణమై ఉన్న వాడూ, జీవులకి దేహేంద్రియాల నిచ్చి ఉపకరించిన వాడూ, కంటికి కనబడేటట్టుగా వచ్చి పడుక్కొని, వాళ్ళ ఇంద్రియాలు తగని విషయాల్లో చిక్కుకోకుండా రక్షించే మహోపకారాన్ని తెలియజేస్తోంది.

**నరాజ్ఞాతాని తత్త్వాని నారాణీతి తతో విదుః।**
**తాన్యేవ చాయనం తస్య తేన నారాయణః స్మృతః**

(భార. అను. 186.7)

(నేననే భగవానుడి వద్ద నించి సృష్టింప బడినవి తత్త్వాలన్నీ, కనుక, వాటిని నారాలని తెలునుకుంటున్నారు. అవే ఆతనికి వాసస్థానమైంది కనుక ఆయన నారాయణుడు అని లెక్కించ బడుతున్నాడు.) వంటి ప్రమాణాల అర్థం కూడ ఇక్కడ అనుసంధింపతగినది.

ప్రళయకాలంలో తాను సమస్త జగత్తుకి కారణమై ఉండే స్థితిని, కార్యమైన ఈ జగత్తునీ తన కడుపులో ఉండి రక్షించి, తరువాత సృష్టించేడన్న దాన్నీ తెలుపుతోంది. **నెఱ్ఱివేఙ్కణ్ణానుమ్ విత్తైముఱివాయ్ నాన్ముగనుమ్ నీణ్డనాల్వాయ్ ఒఱ్ఱిక్కై వెణ్పగట్టి నొరువనైయుమ్ ఉళ్ళిట్ట అమరరోడుమ్ వెఱ్ఱిప్పొర్ క్కడలరైయన్ విఴుఙ్గామల్ తాన్ విఴుఙ్గి ఉయ్యక్కొణ్డ కొఱ్ఱప్పోరాయాన్** - నుదుట కన్నున్న వాడూ, భాషలతో నిండిన నోరుగల చతర్ముఖుడున్నూ, (పెరియతిరు. 11-6-3) అని చెప్పబడే గొప్ప ఉపకారాన్ని చూపుతుంది. **నెఱ్ఱిమేల్కణ్ణానుమ్** అనే పాశురంలో దానికి ముందరి పాశురంలో **ఎమ్బెరుమాన్ ఉణ్డు ఉమిఴ్న్ద ఎచ్చిల్ తేవర్ అల్లాదార్ తాముళరే** - ఎంబెరుమానుడు ఆరగించి బైటకు తీసిన ఎంగిలి దేవతలు కాని వాళ్ళందరూ తామున్నారు గదా (పెరియ తిరు. 11-6-2) అని చెప్పబడడాన్నీ చెప్పి, ఇప్పుడు సంసార సముద్రం తమని ముంచేయకుండా ఉజ్జీవింపజేయడాన్ని ప్రశంసిస్తున్నారు.

**అణ్డరణ్డ బగిరణ్డత్తు ఒరుమానిలమ్ ఎఴుమాల్వరై ముఱ్ఱుమ్ ఉణ్డ కణ్డమ్ కణ్డీర్ అడియేనై ఉయ్యక్కొణ్డదే** - అండంలో ఉండే దేవతలు, మనుష్యులు, తిర్యక్కులు, స్థావరాలు అనే నాలుగు రకాల చేతనులనీ, వాళ్ళు జీవించే స్థలమైన ఆయా అండాలనీ, ఆ అండాలని చుట్టిముట్టుండే ఏడు ఆవరణలనీ, ఆయా అండాలలో ఉండే యాభైకోట్ల విస్తీర్ణం గల మహాభూమి చేతనూ, కులపర్వతాల వల్లనూ, ఉపలక్షణంగా చూపబడే కార్యపదార్థాలు సమస్తాన్నీ తన కడుపులో ఉంచుకొని రక్షించడానికి మింగిన కంఠం కద నాకు నా స్వరూపాన్ని తెలియజేసి, తనని అనుభవింపజేయడం వల్ల ఉజ్జీవింప జేసినది. అండం మొదలైన వాటికంటే చిన్నవైన కులపర్వతాలు మొదలైనవాటిని వేరుగా చెప్పడం వల్ల వాటిని మింగడాన్ని ఆశ్చర్యపరిచేదని తెలుస్తోంది.

**ఆరో పాశురానికి మునివాహన భోగవివరణం పూర్తైంది.** (సశేషం)



## కాకినాడ - యానాం రోడ్డులో గల

# శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్‌స్వామివారి ఆశ్రమంలో వేంచేసి యున్న శ్రీ కల్యాణ వేంకటేశ్వర స్వామివారి ఆలయంలో జరుగు కార్యక్రమ వివరములు.

| | | | |
|---|---|---|---|
| 02-12-11 | శుక్రవారం | : సా॥ 5.30 లకు | లక్ష్మీదేవికి ఊంజల్‌సేవ. |
| 06-12-11 | మంగళవారం | ఉ॥ 9.00 లకు | గీతాజయంతి సందర్భంగా భగవద్గీత సామూహిక పారాయణ,<br>ఏకాదశి, క్షీరాభిషేకం - నిజరూప దర్శనం. |
| 09-12-11 | శుక్రవారం | సా॥ 5.30 లకు | తిరుమంగై ఆళ్వార్ల తిరునక్షత్రం,<br>దివ్య ప్రబంధ నిగమనం<br>లక్ష్మీదేవికి ఊంజల్‌సేవ.<br>వృశ్చిక దీపారాధన. |
| 10-12-11 | శనివారం | ఉ॥ 10.00లకు | శ్రీతిరుప్పాణాళ్వార్ల తిరునక్షత్రం,<br>చంద్రగ్రహణం సందర్భంగా<br>ఆలయం మూసివేయబడును. |
| 16-12-11 | శుక్రవారం | సా॥ 5.30 లకు<br>రా॥ 9.56 లకు | లక్ష్మీదేవికి ఊంజల్‌సేవ,<br>ధనుర్మాస వ్రత ఆరంభం, మొదటి పాశుర విన్నపం. |
| 17-12-11 శనివారం నుండి 31-12-11 శనివారం వరకు | | ఉ॥ 6.00 లకు<br>ఉ॥ 7.30 లకు | ధనుర్మాస వ్రతము<br>దర్శనము |
| 21-12-11 | బుధవారం | : ఉ॥ 9.00 లకు | ఏకాదశి, క్షీరాభిషేకం - నిజరూప దర్శనం |
| 23-12-11 | శుక్రవారం | సా॥ 5.30 లకు | తొణ్డరడిప్పొడియాళ్వార్ల తిరునక్షత్రము.<br>లక్ష్మీదేవికి ఊంజల్‌సేవ, |
| 30-12-11 | శుక్రవారం | : సా॥ 5.30 లకు | లక్ష్మీదేవికి ఊంజల్‌సేవ. |

## మహాభారత కథలు - 40

# ద్రౌపదీ స్వయంవరము

(గత సంచిక తరువాయి) శ్రీ ఉ.వే. శ్రీమాన్ [illegible] గారు, [illegible]

**మదమత్సర నిర్ముక్తః క్షరామృత సేవినమ్**
**మత్స్యం పురాణకర్తారం వ్యాసం వందే మహామునిమ్**

మదమత్సరాది హేయ గుణములు లేనివాడు, "అక్షరు"డైన పరమాత్ముని స్మరణమనే అమృతాన్ని గ్రోలుతూ ఉండేవాడు, మత్స్య పురాణాన్ని రచించినవాడు ఐన శ్రీవేదవ్యాస మునీంద్రులకు నా నమ్ర నమస్కారములు అంటూ,

స్వాచార్యనస్తుతిని గావించి సూతమహాముని నైమిశారణ్యంలో శౌనకాది ఋషులకు "మహాభారత కథల్లో" భాగంగా "ద్రౌవదీ స్వయంవరము" అనే ఘట్టాన్ని చెప్పడం ప్రారంభించాడు.

"మహర్షులారా! పాండవులు ఏకచక్రపురాన్ని విడిచిపెట్టి కొన్నాళ్ళు ప్రయాణించి దారిలో అంగారపర్ణునితో పరిచయం పొంది, ధౌమ్య మహర్షిని తమకు, పురోహితునిగా స్వీకరించి పాంచాల దేశానికి వచ్చి చేరుకున్నారు.




తమను ఎవ్వరూ గుర్తించని విధంగా ఒక కుమ్మరి వాని ఇంటిలో బసచేసి, బ్రాహ్మణోచిత వేష-భాషలతో రోజులు గడుపుతున్నారు.

ద్రుపదుడు నిర్ధారించిన స్వయంవరం రోజు రానే వచ్చింది. ద్రుపదుడు పట్టణాన్ని సర్వాంగ సుందరంగా అలకరించాడు. మామిడి తోరణాలతో పూలగుత్తులతో రమణీయంగా తీర్చి దిద్దాడు. కళ్లాపు నీళ్ళతో, రంగవల్లులతో నగర వీధులు చూడముచ్చటగా ఉన్నాయి. నిర్దిష్ట సమయంలో పాండవులు వేరువేరుగా బయలుదేరి ద్రుపదుని సభామండపంలో చేరి కూర్చున్నారు.

సభామండపం కూడ అత్యంత సుందరంగా, రమణీయంగా, చందన కస్తూరీ మొదలైన సుగంధ ద్రవ్యాల గుబాళింపులతో అదొక ఇంద్ర భవనంలా ఉంది. ముత్యాల సరాలు ఎక్కడికక్కడ వ్రేలాడుతున్నాయి. స్తంభాలు, గోడలు బంగారు తావడంతో కళ్ళకు జిగేల్ మనిపిస్తున్నాయి. వాటికి పొదిగిన ఇంద్రనీలాలు, వజ్రాలు, వైఢూర్యాలు, గోమేధికములు, తమ మీద వడిన దీపపు కాంతులతో మెరిసిపోతున్నాయి. వాటి కాంతులు నభలో ఎక్కడికక్కడ ఇంద్ర ధనస్సులను సృష్టిస్తున్నాయి. ద్రుపదుడు సభామండపంలో ఏర్పాటు చేసిన ధనస్సు ఎక్కుపెట్టమంటాడా? లేక ఈ ఇంద్ర ధనస్సులతో ఎక్కుపెట్టమంటాడా అన్నట్లు చూపరులకు మతి భ్రమను కల్గిస్తున్నాయి.

సభామండపంలో స్వయంవరంలో పాలు పంచుకునేందుకు వచ్చిన రాజులకు ప్రత్యేకంగా ఆసనాలు ఏర్పాటు చేశారు. చూడడానికి వచ్చిన వారికి ప్రత్యేక ప్రాంతాలను ఆసనాలతో అలంకరించారు. బ్రాహ్మణులకు క్షత్రియులకు

ప్రత్యేక నెలవులు ఏర్పాటు చేశాడు. పురజనులు తిలకించడానికి వేరే ఏర్పాట్లు గావించారు. కూర్చున్న వారికి, నిలబడ్డ వారికి ఏ ఇబ్బంది లేకుండ అన్ని జాగ్రత్తలు తీసుకున్నారు.

బ్రాహ్మణుల పంక్తిలో వేరు వేరు చోట్ల పాండవులు ఆసీనులయ్యారు. వారంతా వచ్చి కూర్చున్న రాజులను చూశారు. ఒక ప్రక్క దుర్యోధన దుఃశాసన ప్రముఖులయిన నూర్గురు ధృతరాష్ట్ర పుత్రులు కూర్చున్నారు. వారికి దగ్గరగా కర్ణుడు, అశ్వత్థామ, సోమదత్తుడు, భూరిశ్రవసుడు శ్రుతసేనుడు మొదలైన ప్రముఖులు ఆసీనులై ఉన్నారు. ఇంకొక వైపుగా శల్యుడు, విరాటుడు, జరాసంధుడు; శకుని మొదలుగ గాంధారపతులు వారి వారి పరివారాలతో శోభిల్లుతూ ఉన్నారు. ఇంకొక పక్క అక్రూరుడు, సారణుడు, సాత్యకి, సాంబుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, కృష్ణుడు, బలరాముడు, కృతవర్మ, అనిరుద్ధుడు, యుయుధానుడు మొదలైన వృష్ణి వంశీయులు, భోజ వంశీయులు, అంధక వంశీయులు కూర్చొని ఉన్నారు. అలాగే సుమిత్రుడు, సుకుమారుడు, సుశర్మ, సుదక్షిణ, సుషేణుడు, సేనాబిందుడు, చంద్రసేనుడు, సముద్రసేనుడు, ఉశీనరుడు, చేకితానుడు, శిశుపాలుడు, శ్రేణీమజ్జనుడు, జనమేజయుడు, జయద్రథుడు, బృహద్రథుడు, సత్యవ్రతుడు, చిత్రాంగుడు, శుభాంగదుడు, భగీరథుడు, భగదత్తుడు, పౌండ్రక, వాసుదేవుడు, వత్సరాజు మొదలైన అనేక దేశాధీశులు వారి వారికి తగిన స్థానాలలో ఆశీనులై ఉన్నారు. వీరి నందరినీ గుర్తించి పాండవులు గట్టిగా ఊపిరి పీల్చుకున్నారు.

ఇంతలో వేదధ్వనుల మధ్య ద్రుపదుడు, ధృష్టద్యుమ్నుడు, ద్రౌపదిని తీసుకుని వచ్చారు. తెల్లని వస్త్రాలు, అలంకారాలు, పూవులు ధరించి ఏ దేవతా కన్యయో కద? అని అనిపించేలా సర్వాంగ సుందరంగా ఉన్నది ద్రౌపది. "ఈమె మన్మధుని ఆఖవ బాణం కాదు కద? అనిపిస్తోంది. ప్రక్కనే తల్లి కోకిలాదేవి నిలబడి ఉంది. ద్రౌపదిని చూడగానే రాజకుమారుల హృదయాలు ఒక్కసారు స్పందించ నారంభించాయి. వరమాల శోభిల్లుతూ ఉంది ఆమె చేతిలో.

ద్రుపదుడు సింహాసనంపై కూర్చున్నాడు. సభాసదులను, రాజులను, రాజకుమారులను, బ్రాహ్మణులను, పురజనులను ఒక్కమారు కలియ జూశాడు. అర్జునుడు ఎక్కడైనా ఉంటాడేమోనని ఆయన కన్నులు ఒక్కసారి వెతికాయి. కాని ఆ కళ్ళకు మారువేషంలో నున్న అర్జునుడు కనిపించలేదు.

> **సర్వాంగ సుందరంగా ఉన్నది ద్రౌపది. "ఈమె మన్మధుని ఆఖవ బాణం కాదు కద? అనిపిస్తోంది. ప్రక్కనే తల్లి కోకిలాదేవి నిలబడి ఉంది**

ఇంతలో ధృష్టద్యుమ్నుడు సభనుద్దేశించి ఇలా అన్నాడు. "సభకు నమస్కారములు. మహాజనులారా! మా ఆహ్వానాన్ని మన్నించి వచ్చినందుకు ముందుగా అందరికి కృతజ్ఞతలు తెలియ జేస్తున్నాను. ఇదిగో ఈమె యాజ్ఞసేని. ద్రౌపది, నా చెల్లెలు. కుసుమ కోమలగాత్రి, అరవిందనేత్రి, అన్ని విద్యలను నేర్చుకుంది. మీలో

ఈమెకు తగిన వరుడు ఉన్నాడు. ఐతే ఈమెను వివాహం చేసుకోవాలంటే మేముపెట్టిన "వీరపరీక్ష"లో నెగ్గాలి. అదిగో చూడండి. సభపై భాగంలో మత్స్యయంత్రాన్ని నిర్మించాము. అది అలా తిరుగుతూ ఉంటుంది. దాని మధ్యభాగంలో ఒక మత్స్యమును (చేపను) ఉంచడం జరిగింది. ఇక్కడ విల్లును ఉంచాము. ఐదు బాణాలను కూడ ఉంచాము. విల్లును ఎక్కుపెట్టి ఐదుబాణాలు ప్రయోగించి ఆ మత్స్య యంత్రాన్ని ఛేదించాలి. అలా ఛేదించ గలవారిని మా ద్రౌపది వరించగలదు. కాబట్టి మీరు మీ నైపుణ్యాన్ని పరీక్షించుకోండి" అని ముగించాడు.

'నేను సూతుణ్ణి వివాహం చేసుకోను" అని అందరూ వినేటట్లుగా గట్టిగా అంది ద్రౌపది. కర్ణుడూ విన్నాడు.

**అంత నా రాజనందనులు ద్రుపద రాజనందనం**
**జూచి, కందర్ప బాణ బాధితులయి**
**తమ్మును దమ సామర్థ్యమ్ము నెఱుంగక**
**యర్థిత్వంబున నవ్విల్లు మోపెట్టబోయి.**

రాజకుమారులు ఒక్కొక్కరుగా వచ్చి వారి వారి ధనుర్విద్యా లాఘవాన్ని ప్రదర్శించడం మొదలు పెట్టారు. వచ్చిన వారు వచ్చినట్లే విల్లును వంచలేక, నారి సంధించలేక, వెనుదిరగడం మొదలు పెట్టారు. "ఇదేదో మాయా ధనస్సులా ఉంది. "ఎక్కుపెట్టలేకపోతున్నామేమిటి?" అని అనుకోవడం మొదలు పెట్టారు. కొందరు ముందు వారి సామర్థ్యాన్ని చూచి తాము కూడ అలా భంగ పడవలసి వస్తుందేమోనని లేచి వెళ్ళడమే మానేశారు. దుర్యోధన దుశ్శాసనాదులు వచ్చి ధనస్సు ఎత్తలేక; ఎత్తినా మత్స్యయంత్రాన్ని ఛేదించలేక శిశుపాలుడు, జరాసంధుడు, శల్యుడు వెనుతిరిగారు.

ఇప్పుడందరి దృష్టి కర్ణునిమీదికే వెళ్ళింది. "అతిరథ మహారథులందరూ అయిపోయారు. వారి శక్తి సామర్థ్యాలు అర్థం అయ్యాయి. ఇక కర్ణుడే ఉన్నాడు. అతడూ గొప్ప విలుకాడే!" అని అందరూ తమలో తాము అనుకుంటున్నారు. అందరి ఆలోచనలు నిజం చేస్తూ కర్ణుడు లేవనే లేచాడు. ధనస్సు వద్దకు వెళ్ళాడు.

అటు ద్రౌపదిలో కలవరం మొదలయ్యింది. పాండవులు కూడ కర్ణుడు సమర్థుడే అనుకున్నారు. "నేను సూతుణ్ణి వివాహం చేసుకోను" అని అందరూ వినేటట్లుగా గట్టిగా అంది ద్రౌపది. కర్ణుడూ విన్నాడు. మనస్సు చివుక్కుమంది. ధనస్సు వరకూ వెళ్ళిన అతను గిఱ్ఱున వెనుదిరిగాడు. వచ్చి తన ఆసనంలో కూర్చున్నాడు. ఒక్కమారు హృదయం వికలం అయిపోయింది కర్ణునికి.

సభాస్థలం నిశ్శబ్దం అయ్యింది. అందరూ ఊపిరి బిగించి కూర్చున్నారు. క్షత్రియుల నుంచి మరి ఎవ్వరూ లేవలేదు. ద్రుపదుడు కొంతసేపు చూసి "ఈ సభలో మత్స్యయంత్రాన్ని ఛేదించే వారే లేరా?" అంటూ బ్రాహ్మణ గణం వైపు చూశాడు.

ధర్మరాజు అర్జునునివైపు సాభిప్రాయంగా చూశాడు. అర్జునుడు వెంటనే లేచాడు. బ్రాహ్మణుల్లో కలవరం మొదలయ్యింది. ఇదేంటి? గొప్పగొప్పరాజులే సాధించలేనిది మనవాడేం చేస్తాడు? బ్రాహ్మణ సంఘానికి మచ్చ తేచ్చేట్లు ఉన్నాడు, అని అనుకుంటుండగా అమితమైన

ఉత్సాహంతో విప్రులందరికీ నమస్కరించి అర్జునుడు విల్లు ఉన్న చోటికి వెళ్లాడు.

గురువులకు నమస్కరించాడు. ధనస్సుకి ప్రదక్షిణం చేశాడు. తనకా వింటితో ముందునుండే పరిచయం ఉన్నట్లు అవలీలగా ఎత్తాడు. నారి సంధించాడు. అల్లెత్రాడు ఒక్కమారు లాగి విడిచిపెట్టాడు. టంకారధ్వని సభాప్రాంగణం అంతా మారుమ్రోగింది బ్రాహ్మణులకు గుడి గంటలు మ్రోగుతున్నట్లు అనిపించింది. క్షత్రియులకు యుద్ధ ఘంటికలు మ్రోగినట్లు అనిపించింది. ద్రౌపదికి ప్రేమ ఘంటికలు మ్రోగినట్లు అనిపించింది. అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు.




అర్జునుడు సరాసరి బాణాలను సంధించి అక్లేశంగా మత్స్యయంత్రాన్ని ఛేదించాడు. వీర పరీక్షగా ద్రుపదుడు ఏర్పాటు గావించిన మత్స్యయంత్రం అందరి సమక్షంలో అర్జునుని ద్వారా ఛేదింపబడింది.

బ్రాహ్మణుల్లో ఆనందం నిండిది. క్షత్రియుల్లో ఈర్ష్య మొదలైంది. ద్రుపదునికి సంతోషమైంది. ద్రౌవదికి నరేనరి హృదయం ఆనందంతో నర్తించింది. చెలికత్తెలు వెన్నంటి వస్తుండగా అర్జునుని సమీపించి వరమాలను మెడలో వేసింది. హర్షధ్వానాలు మిన్నంటాయి. జయజయ ధ్వనులు సభాప్రాంగణం అంతానిండి పోయాయి. అంతా కోలాహలమయం అయిపోయింది.

ధర్మరాజు నకులసహదేవులతో కలసి ఇంటికి వచ్చాడు. ద్రౌపదీ అర్జునులు ద్రుపదుని దగ్గరకు వచ్చారు. ద్రుపదుడు అర్జునుని కౌగలించుకుని "వీరపరీక్ష పూర్తయ్యింది. ఈ బ్రాహ్మణ కుమారునితో ద్రౌపదీ జరుగుతుంది" అని నిర్ణయాన్ని తెలియజేశాడు. బ్రాహ్మణులు ఆశీర్వదించారు. క్షత్రియుల్లో "బ్రాహ్మణునితో ద్రౌపదికి పెళ్లేంటి?" అనే వ్యతిరేకత ఏర్పడింది. చాల మంది రాజులు సభాభవనాన్ని విడిచి పెట్టి వారి వారి నెలవులకు తిరిగి వెళ్ళి పోయారు.

ఇష్టపడని రాజులంతా అర్జునుని మీదికి కత్తులను ఝళిపిస్తూ వచ్చారు. ద్రుపదుడు భయపడ్డాడు. పరిస్థితిని గమనించి భీముడు దగ్గరలోనే ఉన్న ఒక వృక్షాన్ని పెకిలించి దాని ఆకులు దులిపి అర్జునునికి అండగా నిలిచాడు. రాజులను ఎదుర్కొన్నాడు.

బలరాముడు కంగారు పడ్డాడు. కృష్ణుడు వారించాడు. "అన్నయ్యా! ఆ మత్స్యయంత్రాన్ని ఛేదించినది వేరే మరెవ్వరో కాదు. మన కుంతీ తనయుడు అర్జునుడే. ఆ చెట్టుని పెకిలించి రాజులను ఎదుర్కొంటున్నది సాక్షాత్తు భీమసేనుడే. వారిని ఇక్కడివారు ఎవ్వరూ జయించలేరు. శృతిమించితే మనం కలుగ జేసుకుందాం. అంతవరకు ఏం జరుగుతుందో చూద్దాం" అన్నాడు.

శల్యుణ్ణి భీముడెదుర్కొన్నాడు. కర్ణుణ్ణి అర్జునుడు ఎదుర్కొన్నాడు. హోరాహోరిగా యుద్ధం జరుగుతోంది. కర్ణుడు వేసిన ప్రతీ బాణాన్ని అర్జునుడు అంతరిక్షంలోనే ముక్కలు చేస్తున్నాడు. తిరిగి వానిపై గాయాలు చేస్తున్నాడు. నాలుగు గట్టి బాణాలు కర్ణునికి తగిలాయి.

యుద్ధాన్ని ఆపి కర్ణుడన్నాడు. "భళా! విప్రోత్తమా! భళా! నేను కర్ణుడను. నాతో ఎవ్వరూ యుద్ధం చేయలేరు. ఐతే ఇంద్రుడైనా అవ్వాలి లేదా పరశురాముడైన అవ్వాలి. కాకపోతే అర్జునుడైనా అవ్వాలి. నీవు సామాన్య బలశాలివి కాదు. నీ విక్రమమునకు, విల్లునేర్పునకు నేను నిన్ను మెచ్చుకుంటున్నాను. ఇంతకీ నీవు ఎవరవు?" అని అడిగాడు.

అర్జునుడు, "కర్ణా! నీవనుకుంటున్నట్లు నేనేమీ కాదు. సామాన్య బ్రాహ్మణ కులస్థుడను. సాహసం ఉంది. యుద్ధం చేయి"రా! అన్నాడు.

బ్రాహ్మణునితో నాకు యుద్ధం సమంజసం కాదు. నేను యుద్ధాన్ని విరమించుకుంటున్నాను" అని కర్ణుడు యుద్ధాన్ని విరమించాడు.

అటు శల్యుడు కూడ భీముని చేతిలో చావు దెబ్బలు తిన్నాడు. అక్కడ నుండీ వెనుతిరిగాడు. అక్కడి వారంతా వీరిని వేనోళ్ళ కొనియాడారు.

కృష్ణుడు "యుద్ధం ఆపండి, చాలింక. స్వయంవరంలో గెల్చిన ఈ బ్రాహ్మణునికే ద్రౌపది చెందింది. అందరూ వదండిక" అంటూ రాజవర్గాలను హెచ్చరించి వారిని అక్కడ నుండీ వెళ్లేటట్లు చేశాడు.

అర్జునుడు, ద్రౌపది, భీముడు, బ్రాహ్మణులు అనుసరిస్తుండగా సభాప్రాంగణాన్ని విడిచి యథేచ్ఛగా ప్రయాణమయ్యారు.

"మహార్షులారా! ఇప్పటికిదీ కథ. రాజులలో రారాజుగా పేరెన్నిక గన్న దుర్యోధనుని సమక్షం లోనే అర్జునుడు తన పరాక్రమాన్ని చూపించి, మత్స్య యంత్రాన్ని ఛేదించి రాజులందరినీ త్రోసిరాజని, ద్రౌపదిని పాణిగ్రహణం చేశాడు. పౌరుషాన్ని ప్రదర్శించాడు. అనన్య సామాన్యుడయ్యాడు.

సరే, ఈ పూటకి ఇక్కడికి ఉంచుదాం. రేపు మరొక విశేషఘట్టంతో మన సంధ్యాసదస్సును ప్రారంభించుకుందాం. అంతవరకూ వైకుంఠ నారాయణులు మనలనురక్షిస్తూ ఉండాలని కోరుకుందాం. సంధ్యావందనానికి ఇక సమయమైంది కాబట్టి లేద్దాం.

(సశేషం)

## అభిప్రాయములు

శరణ్య పత్రికలో ప్రచురించబడుతున్న వ్యాసములు, గేయములు మొదలగునవి ఆయా రచయితల, రచయిత్రుల అభిప్రాయలని ప్రతిబింబిస్తాయి కాని అవే అభిప్రాయాలు శరణ్య పత్రిక సంపాదక వర్గ **లేదా** యాజమాన్య **లేదా** శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్య పీఠం **లేదా** జీయర్ స్వామి వారి అభిప్రాయాలతో కూడ ఏకీభవించాలనే నియమం లేదని పాఠకులు గమనించ ప్రార్థన. - సెక్రటరీ శరణ్య ఆధ్యాత్మిక పత్రిక



భగవద్రామానుజుల ప్రతినిధులైన

పరమహంస పరివ్రాజకాచార్య

## శ్రీశ్రీశ్రీ త్రిదండి కృష్ణయతీంద్ర రామానుజ జీయర్ స్వామి వారి

### డిసెంబరు నెలలో జరుగు కార్యక్రమ వివరములు

1వ తేదీ నుండి 4వ తేదీ వరకు కరీంనగర్ ఆశ్రమంలో వేంచేసి ఉంటారు.

5వ తేదీ నుండి 8వ తేదీ వరకు నిజామాబాద్ ఎ.పి.హెచ్.బి. కాలనీలో వేంచేసి ఉంటారు.

6వ తేదీన గీతాజయంతి సందర్భంగా సామూహిక గీతా పారాయణ కార్యక్రమం.

7,8 తేదీలలో ఆర్తి గలవారికి సమాశ్రయణాలు కటాక్షిస్తారు.

9వ తేదీ నుండి 14వ తేదీ వరకు ముదక్‌పల్లి ఆశ్రమంలో గీతా ప్రవచనాలు కటాక్షిస్తారు.

15వ తేదీ కరీంనగర్ ఆశ్రమంలో వేంచేసి ఉంటారు.

16వ తేదీ నుండి 31వ తేదీ వరకు ధనుర్మాస వ్రతం ఆశ్రమంలో నిర్వహిస్తారు.

సూచన : అత్యవసర పరిస్థితులలో సందర్భాన్ని అనుసరించి పై కార్యక్రమంలో మార్పులు జరుగవచ్చు.

## గమనిక

శ్రీగీతా ఆశ్రమం

డో.నెం. 10-1-651, సంతోష్‌నగర్, కరీంనగర్ - 1.

(శాఖ : ఎ.పి.హెచ్. బోర్డ్ కాలనీ, నిజామాబాద్.) ఫోన్ 0878 - 2276976, 94406 50664.

# శ్రీ మద్రామాయణం (అరణ్యకాండ)

శ్రీమతి చెలికాని మైథిలి గారు, బొబ్బిలి.

(గత సంచిక తరువాయి)

22 ప్ర. **రావణాసురుడు దండకారణ్యమును ఎవరెవరి అధికారములలో ఉంచెను.**

జ. రావణాసురుడు దండకారణ్యమును ఖర, దూషణ, త్రిశరసులు అను ముగ్గురి అధికారంలో ఉంచెను. వారికి సాయముగ పదునాలుగు వేల రాక్షసులను నియమించెను.

23 ప్ర. **సుతీక్ష్ణాశ్రమమునకు పోవుమార్గములో శ్రీరామచంద్రుడు దర్శించిన వివిధ తాపసుల గురించి తెలుపుము?**

జ. శ్రీరామచంద్రుడు దండకారణ్యములో పలురకములైన నియమములను పాటించుచు తపములు చేస్తున్న మునులను దర్శించెను. వారు,

1. **వైఖానసులు** : వీరు భగవంతుడి గోళ్ళ (నఖములు) నుండి పుట్టినవారు. వీరు, విఖనస ముని చెప్పిన సూత్రము ప్రకారము ప్రవర్తిస్తుంటారు.

2. **వాలఖిల్యులు** : వీరు పరమాత్మ రోమముల (వెంట్రుకల) నుండి పుట్టినవారు. వీరు క్రొత్తగ తమకు ఏదైన ఆహారం దొరికితే ముందు దాచి ఉంచుకున్న ఆహారమును పూర్తిగ వదిలివేస్తారు.

3. **మరీచిపులు** : వీరు ఆకాశమునకు ఎదురుగ తమ నోరు తెరుచుకొని సూర్యకిరణములు, చంద్రకిరణములు ఆహారముగ స్వీకరిస్తుంటారు.

4. **సంప్రక్షాళులు** : వీరు భగవంతుడి యొక్క శ్రీపాదతీర్థము నుండి పుట్టినవారు. వీరు తమ శరీరమును ఎప్పుడు తడుపుకుంటూ ఉంటారు. (ప్రక్షాళనము) వీరు రేపటి కోసం ఏమీ దాచుకోరు. ఏ రోజు దొరికినది ఆ రోజేతిని పాత్రలను శుద్ధి చేసేసుకుంటారు.

5. **అశ్మకుట్టులు** : వీరు గింజలు, కందమూలములు మొదలగు వానిని ఉడకబెట్టి ఆహారముగ తినరు. వాటిని రాళ్ళతో మెత్తగా చేసుకొని తింటారు. తమ శరీరమును రాళ్ళతో కొట్టుకుంటారు.

6. **దంతాలూఖలులు** : వీరు తమ దంతములనే రోలుగ ఉపయోగిస్తారు. ఏ ధాన్యపు గింజలు దొరికిన, తమ పళ్ళతోనే వాటిపై పొర తీసివేసి కొరికి, ముక్కలు చేసుకొని తింటారు.

7. **పత్రాహారులు** : ఎండిపోయిన చెట్లనుండి రాలిపడిన ఆకులను తిని వీరు జీవిస్తారు.

8. **ఉన్మజ్జకులు** : నీటిలో, తల మాత్రము

పైకి ఉంచి, గొంత వరకు మునిగి ఉండి తపస్సు చేస్తారు.

**9. గోత్రశయ్యులు** : వీరు కటికనేలమీద ఏమీ వేసుకోకుండ పడుకుంటారు.

**10. అశయ్యులు** : వీరు ఎప్పుడు నిలబడే ఉంటారు. ఎప్పుడు పడుకోనివారు.

**11. అభ్రావకాశులు** : తీవ్రమైన గాలులు వీచినను, ప్రచండమైన ఎండలు కాసినను, వానలు పడుతున్నను తమ రక్షణ కోసం ఏమీలేక, ఆరుబైటనే ఉంటారు.

**12. నలిలాహారులు** : వీరికి నీరే ఆహారము.

**13. వాయుభక్షకులు** : వీరు గాలిని నోటితో పీల్చుకొని జీవిస్తారు.

**14. ఆకాశ నిలయులు:** వీరు యోగశక్తితో శరీరము నేల తాకకుండ అకాశమున నిలిపి ఉంచుతారు. మరి కొందరు నేలమీద ఉండక చెట్టుకొమ్మల మీద జీవించి ఉంటారు.

**15. వ్రతోపవాసులు** : వీరికి ఉపవాసమే వ్రతము. ఏ ఆహారము తీసుకోరు.

**16. ఆర్ద్రపటవాసులు** : వీరు నిత్యం తడిబట్టలతో ఉంటారు.

**17. తపోనిత్యులు** : వీరు ఎల్లప్పుడు వేదములను చదువుతుంటారు.

**18. పంచతపోన్వితులు** : వీరు నాలుగు వైపుల నాలుగు అగ్నిహోత్రములు ఉంచుకొని, గీష్మఋతువులో సూర్యుడిని సేవించుచు తపస్సు చేస్తారు.

**19. సజపులు** : వీరు జపము నిత్యము చేస్తుంటారు.

**20. దృఢయోగులు** : వీరు యమ, నియమాది అష్టాంగయోగమును ఎప్పుడు అభ్యసించుతుంటారు.

**21. సమాధి నిష్ఠులు** : వీరు యోగము నందే నిష్ఠకలవారు.

**22. స్థండిలశాయులు** : పైన ఏమీ కప్పుకొనకుండ, దర్భగడ్డి వేసుకొని నిదురించేవారు.

24 ప్ర. **తాపసులు తమ యొక్క మరియు అచ్చట ఉంటున్న వానప్రస్థుల యొక్క రక్షణ బాధ్యత శ్రీరామచంద్రుడికి కలదని, చెప్పిన కారణములు ఏవి?**

జ. ఇక్ష్వాకు వంశములో పుట్టిన శ్రీరామచంద్రుడికి తమ రాజ్యములోని ప్రజలందర్ని రక్షించవలసిన బాధ్యత ఉన్నది.

**ప్రజలు తమకు వచ్చిన ఆదాయంలో ఆరవవంతను రాజుగారికి పన్నుగా కడతారు. ప్రజలనుంచి పన్ను తీసుకొని రాజు వారిని కాపాడకపోతే, చాల అధర్మము వస్తుంది.**

తన ప్రజలను కన్న బిడ్డల వలె కాపాడే రాజు శాశ్వతమైన కీర్తిని పొందటయే కాక, బ్రహ్మ లోకములో బ్రహ్మచే పూజించబడతాడు. దండకారణ్యములో వానప్రస్థులైన క్షత్రియులు, వైశ్యులు మొదలగు వర్ణముల వారు కూడ ఉన్నారు. వీరందరు తమ రక్షణ తాము

చేసుకోకుండా శ్రీరామచంద్రుడే తమ రక్షకుడను భావనతో ఉన్నారు. ఇంక

**తాపసులు అడవులలో లభించే కందమూలాదులు తింటు తపము చేస్తున్నారు. వీరు ధర్మమునే ప్రథమముగ ఆచరించేవారు. వీరి తపస్సులో నాలుగవ భాగం, రాజుకు చెందుతుంది.**

అట్టి తాపసులను రక్షించే ధర్మము శ్రీరామచంద్రుడికి ఉంది.

25 ప్ర. **శ్రీరామచంద్రుడు, తాపసులకు ఏమని అభయమిచ్చెను?**

జ. శ్రీరామచంద్రుడు తాపసుల దీనస్థితిని చూచి బాధపడినాడు. తనను ఆజ్ఞాపించ వలసిన తాపసులు, వేడుకొనుట తనకు సిగ్గుగా ఉన్నదని, తన అరణ్య వాసమునకు ముఖ్య ప్రయోజనమే రాక్షసులను శిక్షించుట యని, తన తమ్ముడితో కలసి రాక్షస సంహారము చేస్తానని శ్రీరామచంద్రుడు తాపసులకు అభయమిచ్చెను.

26 ప్ర. **శరభంగుడు, సుతీక్ష్ణుడు తమ తపః ఫలమును శ్రీరామచంద్రుడ్ని స్వీకరింప మని ప్రార్థించుటలోని అర్థమేమి?**

జ. మనము చేసే ప్రతీ కర్మకు ఫలితమును ఇచ్చేవాడు భగవంతుడే ఈ ఫలము ఆయనకి చెందినది. పరమాత్మకు మన కర్మఫలము సమర్పించుట, మన స్వరూపమును గుర్తించుటకే. పరమాత్మయైన శ్రీరామచంద్రుడే కర్మ ఫలభోక్త అని తెలుసుకొనే శరభంగుడు, సుతీక్ష్ణుడు, తమతమ తపఃఫలమునకు స్వీకరింపమని ప్రార్థించిరి.

27 ప్ర. **శ్రీరామచంద్రమూర్తి, సుతీక్ష్ణుడు యొక్క పరస్పర సంభాషణలలోని వైచిత్ర్యము ఏమి?**

జ. తాము దండకారణ్యములో నివసించుటకు తగిన ప్రదేశమునకై రామచంద్రమూర్తి సుతీక్ష్ణుడిని అడిగాడు. దానికి సుతీక్ష్ణుడు తమ ఆశ్రమం సురక్షితమైనదని, గోష్ఠులుగ మునులు అక్కడకు వచ్చి వెళ్తుంటారని, పండ్లు, కందమూలాదులు ఎప్పుడు సమృద్ధిగా దొరుకుతాయని చెప్పుచు, మృగములు (లేళ్ళు) గురించి ఒక మాట చెప్పెను. ఇచ్చట లేళ్ళు నిర్భయంగా తిరుగుచు వాటి అందముచే మనస్సును ఆకర్షించు తుంటాయని, దాని వలన తపస్సుకు ఆటంకము కలుగుతుంటుందని, అది తప్ప ఈ అరణ్యములో మరే విధమైన దోషము లేదని చెప్పెను. మహర్షి మాటలలోని అర్థమును గ్రహించిన శ్రీరాముడు, సమాధానముగ "తమకు లేళ్ళవలన భయము లేదని, తాను పిడుగు వంటి బాణములతో వాటిని చంపగలన"ని ధైర్యముగ చెప్పెను. వీరిరువురి మాటలు జరగబోవు సంఘటనలను సూచిస్తున్నాయి. ఈ దండకారణ్యములోనే మృగ రూపములో

మారీచుడు తన అందచందాలతో సీతమ్మని లోభ పెట్టాడు. తరువాత శ్రీరామచంద్రుడు తన బాణముతోనే మారీచుడిని చంపాడు.

28 ప్ర. **మగవారిలో కోరికలు వచ్చినప్పుడు మూడు వ్యసనములు వచ్చునని సీతమ్మ చెప్పినది. అవి ఏవి?**

జ. మనసులో కోరికలు పుట్టగానే పురుషులు ఈ మూడు వ్యసనములకు పాలుపడకుండ ఉండలేరు.

1. అసత్య వచనము అనగా అబద్ధములు ఆడుట.
2. తాత్కాలికమైన శరీర సుఖము కోసం పరాయి స్త్రీని కోరుకొనుట.
3. ఏమాత్రము శత్రువులు కాని వారితో యుద్ధము చేయుట.

29 ప్ర. **ఋషులకిచ్చిన అభయము (రాక్షసవధ) నుండి శ్రీరామచంద్రమూర్తిని సీతాదేవి, ఎందుకు మరలింప చూచినది?**

జ. శ్రీరామచంద్రుడిలోని శరణాగత రక్షణను మరింతగ పెంచుటకే సీతమ్మ రాక్షసుల వధను వారించుచున్నట్లు మాట్లాడినది. మహాలక్ష్మి అవతారమైన సీతమ్మ సామాన్య స్త్రీవలె నారాయణుడైన శ్రీరామచంద్రుడికి ధర్మములు చెప్పినది.

30 ప్ర. **శస్త్రములు (ఆయుధములు) ఎప్పుడు తమతో ఉంచుకోవటము వలన వచ్చే అనర్థములను గురించి సీతమ్మ రామచంద్రమూర్తితో చెప్పిన వృత్తాంతము ఏమి?**

జ. పూర్వకాలములో ఒక ముని ఉండేవాడు. ఆయన సత్య ధర్మములను నిష్ఠగా ఆచరించేవాడు. అడవిలోని క్రూరజంతువులను పక్షులను దయగ చూస్తుండేవాడు. ఆయన తపస్సును భంగపరచాలని ఇంద్రుడు ఒక రోజు ఒక భటుని రూపంలో వచ్చి ఆయనకి ఒక కత్తిని ఇచ్చి "ఈ కత్తిని మీ వద్ద భద్రముగ ఉంచండి. మళ్ళీ నేను వచ్చి తీసుకుంటా''నని చెప్పి స్వర్గ లోకమునకు వెళ్ళిపోయాడు. ఆ కత్తిని ఎవరూ దొంగలించకూడదని ముని నిత్యము దానిని తనతో ఉంచుకొనే వాడు. దర్భలను, సమిధలను కోయుటకు ఆ కత్తిని ఉపయోగించే వాడు. ఆ కత్తితో గల సాన్నిహిత్యం వలన ముని స్వభావము నెమ్మదిగ మారిపోయి దయాగుణము నశించి హింసా ప్రవృత్తి పెరిగి పోయినది. ఆయన ధర్మము నుండి పతన మయ్యాడు.

**అగ్ని దేనిని ఆశ్రయించితే అది దహింపబడినట్లు, ఆయుధము, ఎవరు తనను ధరించుతారో వారిని సర్వనాశనము చేస్తుంద"ని సీతమ్మ రామయ్యతో చెప్పినది.**

31 ప్ర. **అగ్రతః ప్రయయౌ రామః**
**సీతాఃమధ్యే సుమధ్యమా।**
**పృష్ఠతస్తు ధనుష్పాణిః**
**లక్ష్మణోఽనుజగామ హ॥**
**పై శ్లోకములోని భావము ఏమి? వాల్మీకి**

**మహర్షి ఈ శ్లోకంలో "హ" అని ఆశ్చర్యం ఎందుకు ప్రకటించాడు?**

జ. శ్లోకము భావము: దండకారణ్యములో ముందు శ్రీరామచంద్రమూర్తి నడుస్తున్నాడు. మంచి నడుము గల సీతాదేవి మధ్య నడుస్తున్నది. ఆమె వెనుక ధనస్సును చేతిలో ధరించి లక్ష్మణస్వామి నడుస్తున్నాడు.

**వాల్మీకి మహర్షికి అకారము, ఉకారము, మకారములుగా శ్రీరామ, సీతా, లక్ష్మణుల దర్శనము లభించింది.**

అట్టి అకార, ఉకార - మకారముల సంఘాతము ఓంకారము, ప్రణవము. ప్రణవమును ఉపాసించే మహర్షుల వద్దకు ప్రణవమే నడచివస్తున్నట్లు తలచి ''హ'' అని వాల్మీకి మహర్షి ఆశ్చర్యపోయాడు.

32 ప్ర. **శ్రీరామచంద్రమూర్తి సందర్శించిన "పంచాప్సరసము" అను తటాకము (చెరువు) యొక్క వృత్తాంతమేమి?**

జ. ధర్మభృత్తు అనేపేరు గల ముని శ్రీరామ చంద్రమూర్తికి ''పంచాప్సరసము'' అనే సరస్సు గురించి ఈ విధముగ చెప్పాడు. ఈ సరస్సును ''మాండకర్ణి'' అని పేరు గల ముని శాశ్వతంగా ఉండేటట్లు నిర్మించాడు. ఆయన పదివేల సంవత్సరములు గాలినే ఆహారముగ తీసుకొని ఈ సరస్సులో తపస్సు చేసాడు. మాండకర్ణి తపస్సు ఫలించినట్లయితే తమ తమ పదవులకు భంగము కలుగుతుందని దేవతలు భయపడిరి. ఆయన తపస్సును భగ్నము చేయుటకు అయిదుగురు అప్సరసలను వారు పంపారు. మాండకర్ణి ఒక ఇల్లు నిర్మించి వారితో సంసారము చేయు చుండెను. తన తపఃశక్తితో మాండకర్ణి నిత్యయవ్వనంతో ఉండెను. ఆయన భార్యల నృత్యము వాయిద్యముల నాదములు, వారి ఆభరణముల సవ్వడి ఆ సరస్సు ప్రక్క నుండి పోవుచున్న వారికి వినబడుతుంటాయి. శ్రీరామచంద్రులు ఆ ధ్వనులని వినిరి.

33 ప్ర. **సుతీక్ష్ణుని ఆశ్రమము నుంచి శ్రీరామచంద్రుడు ఎవ్వరిని దర్శించవలెనని కోరుకొనెను? అందులకు గల కారణమేమి?**

జ. శ్రీరామచంద్రమూర్తి అగస్త్యమహర్షిని దర్శించాలని తలంచాడు. తాను అరణ్యవాసమునకు వచ్చినది కేవలము నాన్నగారి మాటలను సత్యము చేయుటకే కాదు, తనను శరణు వేడిన దేవతలను, ఋషులను రావణాసురుని హింస నుంచి రక్షించాలి. అది తన ధర్మము. రావణాసురుడి వధకై, ఇంద్రుడు, తనకి ఈయవలసినదని ఆయుధములు అగస్త్యుడికి ఇచ్చాడను విషయము, రామచంద్రమూర్తికి తెలుసు. ఆ ఆయుధములను తీసుకొనుటకై అగస్త్యుడిని దర్శించవలనని తలంచెను.

(సశేషం)



భగవద్రామానుజుల ప్రతినిధులైన

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీనివాస వ్రతధర నారాయణ రామానుజ జీయర్ స్వామి వారి**

**డిసెంబరు నెలలో జరుగు కార్యక్రమ వివరాలు**

నవంబరు 16వ తేదీ నుండి 27వ తేదీ వరకు నైమిశారణ్యంలో వేంచేసి ఉన్నారు.

డిసెంబరు 16వ తేదీ నుండి హైదరాబాద్ కోటిలో గల నరసింహమందిర్‌లో ధనుర్మాసం ఉదయం 6గం॥లనుండి 8గం॥ల వరకు నిర్వహిస్తారు.

జగన్నాథమట్, 12-1-482, సీతారాం బాగ్ ప్రక్కన,
హైదరాబాద్ - 500 006. ఫోన్ : 040 - 24800847.

# విభీషణుని శరణాగతి

శ్రీమాన్ రాళ్ళబండి శ్రీనివాసన్‌గారు, హైద్రాబాద్

శ్రీరాముడు వానరసేనతో బయలుదేరి సముద్రతీరం చేరుకున్నాడు. లంకాధిపతి రాక్షసేశ్వరుడు రావణుడు మంత్రాలోచనలు జరిపాడు. శత్రు సంహారం చిటికెలో చేస్తామన్నారు అంతా. కుంభకర్ణుడిలా అన్నాడు. "నీవు జనస్థానం నుంచి సీతను తీసుకురావటానికి ముందు పారిషదులతో ఆలోచించి ఉండాలి. అపుడు మంత్రణం మానేసావు ఎందుకు? కామమోహితుడవై నీవు చేసిన కార్యం దోషపూరితం. పరదారాపహరణ సమయంలో రాముడు నిన్ను చంపలేదు. అది నీ దైవయోగం. నీవు చేసింది మంచి పని కాదు. అయినా నా శక్తి వంచన లేకుండా యుద్ధం చేస్తా..." అలా సాగాయి కుంభకర్ణుని మాటలు.

ఇక విభీషణుడన్నాడు "రాముడు దైవోపహతుడు కాదు. అందుకే ఇంతదూరం వచ్చాడు. పతివ్రతని బంధించటం బాధించడం మహాపాపం. ఆమె శోకాగ్ని రాక్షస జాతిని సమూలంగా భస్మం చేయకముందే మైథిలిని రాముని సన్నిధి చేర్చటం క్షేమకరం, ధార్మికత్వం. రాజనీతి దూరదృష్టి రాజ్యక్షేమం సుస్పష్టం అతని పలుకుల్లో. తమ్మునికి సమాధానం చెప్పకుండా సభలో నుంచి నిష్క్రమించాడు రావణుడు. అయినా మరుసటి రోజు ఏకాంతంలో ఎన్నో హితవచనాలు చెప్పాడు విభీషణుడు. రాక్షసేశ్వరుడిలా అన్నాడు. "నాకు ఎక్కడ కాని భయనిమిత్తాలు కనిపించటం లేదు. రాముడు నా నుంచి మైథిలిని విడిపించుకొని పోలేడు. సర్వదేవతా గణాలతో కలసి వచ్చినా సరే రాఘవుడు నా ముందు నిలవజాలడు."

రావణుని మూర్ఖత్వం వల్ల లంక సర్వనాశనమవుతుందని విభీషణుని విచారం.

> "కులంలో చెడపుట్టావు తమ్ముడివి గనుక బతికిపోయావ్ పో- అని గర్జించాడు.

పరులు నాశనమైనా తనొక్కడు సుఖపడాలనుకుంటాడు దుర్జనుడు. పరుల బాగుకోసం తను నాశనమైనా పరవాలేదనుకుంటాడు సజ్జనుడు. అందుకు అవాంతారాలెన్ని కల్గినా సహిస్తాడు. "పిరికి పందవు" అని ఇంద్రజిత్తు నిండు సభలో అవహేళన చేసినా భరించాడు విభీషణుడు. మళ్ళీ మళ్ళీ మంచి చెబుతుంటే ఆగ్రహోదగ్రుడయ్యాడు లంకేశ్వరుడు. "కులంలో చెడపుట్టావు తమ్ముడివి గనుక బతికిపోయావ్ పో"- అని గర్జించాడు.

ధర్మాన్ని నమ్మిన వాడు ఇంక అక్కడ ఉండటం నిష్ప్రయోజనమని రామాశ్రయం వల్ల మనశ్శాంతి లభిస్తుందని అన్నని విడిచి ఆకాశంలోకి ఎగిరాడు. ఇలా అన్నాడపుడు.

"రాజా! ప్రియమైన మాటలు పలికే వారు

కోకొల్లలుగా ఉంటారు. కాని అప్రియమైన హితం కోసం పథ్యపు మాటలు చెప్పేవారు, చెప్పినా వినేవారు లోకంలో అరుదు. నన్ను క్షమించు. నిన్నూ నిన్ను నమ్ముకున్న వాళ్ళని రక్షించుకో. నీకు శుభమగుగాక''

శత్రువు బలవంతుడని తెల్సి కూడ ఆపద సమయంలో రావణుని పక్షంలో ఉండకుండా పోయాడు తమ్ముడు. ఇది న్యాయమా? అని ప్రశ్న. 'నీవు నాకు జ్యేష్ఠసోదరుడివి. తండ్రితో సమానం. నీ మేలు కోరి ఎంత చెప్పినా వినలేదు. ధర్మ భ్రష్టుడివయ్యావు"- అని విభీషణుని పలుకులు.

ధర్మం కోసం లోకహితం కోసం సత్యాన్వేషణ కోసం పరమాత్మ కోసం ఎవరినైనా విడిచి పెట్టవచ్చు. ప్రహ్లాదుడు తండ్రిని వదిలాడు. తల్లిని తిరస్కరించాడు భరతుడు. గురువు మాట కాదన్నాడు బలిచక్రవర్తి. రామానుజులు భార్యని పరిత్యజించాడు. సిద్ధార్థుడు రాజ్యం విడిచిపెట్టాడు. మీరాబాయి భర్తని విడిచింది. అలాగే విభీషణుడు అన్నని విడిచివెళ్ళాడు. సుగ్రీవుని రామునికి తన శరణాగతిని తెలియచేయమన్నాడు.




శరణాగతి అంటే ఉపాయం ఉపేయం సర్వమూ పరమాత్మే అని ఆయన మీదే భారం వేయాలి. నీట ముంచినా పాల ముంచినా నీవే దిక్కు - అనగల్గాలి. సర్వస్వతంత్రుడైన భగవంతునికి తన పరతంత్రతని, దైన్యాన్ని చాటి చెప్పాలి. అదే శరణాగతి. అదే ప్రపత్తి. అదే న్యాసం.

దేశకాల నియమాల్లేనిది శరణాగతి. నీటి మడుగులో నుంచి శరణాగతి చేసాడు గజేంద్రుడు. నిండు సభలో ఏక వస్త్రయై ప్రపత్తి చేసింది ద్రౌపది. రణరంగంలో ఉభయ సేనల మధ్య అర్జునుడు శరణువేడాడు. ఆకాశంలో ఆగి ప్రపత్తి చేసాడు విభీషణుడు "దుర్మార్గుడైన రాక్షసేశ్వరుడైన రావణుని తమ్ముడిని. దారా పుత్రాదుల్ని సైతం విడిచివచ్చాన''ని నైచ్యానుసంధానం చేసాడు. సదాచార్యుల ద్వారా సద్గురువుల ద్వారా లేదా అమ్మ వారి ద్వారా పరమాత్మకు తన శరణాగతిని నివేదించమని ప్రార్థించాలి. ఇది అనూచానంగా ఆనవాయితీగా వస్తున్న సనాతన సంప్రదాయం. అందుకే విభీషణుడు సుగ్రీవునికి తనను రామ సన్నిధికి చేర్చమని విన్నవించుకున్నాడు. గోదాదేవి కూడ ముందుగా అమ్మవారి అనుగ్రహం పొంది ఆమె ద్వారా స్వామి కృపకు పాత్రురాలైంది. సీతమ్మని పురుషకారంగా భావించి "సీతమ్మ చెప్పవమ్మా" అన్నాడు భక్తరామదాసు.

"గుడ్లగూబ కాకుల్లో చేరి వాటిని నాశనం చేస్తుంది. అలాగే విభీషణుడు మనలో చేరి చేటు కల్గిస్తాడు మనకు. కనుక అతనికి శరణు ఈయరాదు'' అన్నాడు సుగ్రీవుడు. ''ఇంద్రుని దగ్గర నుంచి వచ్చిన వాడైనా సరే అనుమానించాలి. ఇతన్ని నమ్మరాదు'' అన్నాడు అంగదుడు. అలాగే విభీషణునికి వ్యతిరేకంగా మాట్లాడారు జాంబవంతుడు, శరభుడు. హనుమంతిడిలా అన్నాడు ''అతని ముఖకవళికల్లో ఏదోషం కనపడటం లేదు. వాలిని చంపి సుగ్రీవుని రాజుని

చేసిన విషయం తెల్సుకుని ఉంటాడు. రాజ్యకాంక్షతో వచ్చాడు. అభయమిచ్చి రక్షించగలవని పూర్తి నమ్మకంతో ఉన్నాడు."

మనలో మాట రాముని వల్ల అన్నని చంపించి కిష్కింధాధిపతి అయ్యాడు సుగ్రీవుడు. ఇపుడు శరణాగతుడైన విభీషణుని నమ్మరాదు శిక్షించు అని అనటం విచిత్రంగా ఉంది.

"నేను నీవాడను నన్ను రక్షించు అని ఒక్కసారి యాచించిన వానికి సర్వ భూతాల నుంచి అభయ మిస్తాను. ఇది నా వ్రతం" అన్నాడు రామచంద్రుడు. విభీషణుడు అనుమతి కోరాడు. ఇంకా శరణు వేడలేదు. అయినా శీఘ్రంగతిలో అతనికి అభయ మిచ్చాడు. సుగ్రీవుని విషయంలో అంత సులభంగా ప్రసన్నుడు కాలేదు రాముడు. కారణం అతడు దాశరథిని విశ్వసించ లేదు. శరణాగతుడు కాలేదు. రెండు రకాల పరీక్షలు పెట్టాడు. ఒకటి వాలి వధ. రాజ్యాధిపత్యం రెండోది. అవి రెండు సాధించాలని స్నేహం చేసాడు. ఆ స్నేహం అసాధారణం అనితర సాధ్యం. అతి స్నేహ ప్రభావంతో రామునికి ప్రాణహాని కల్గుతుందేమోనని శంకించి "విభీషణుని చేరదీయ వద్దు, శిక్షించు" అన్నాడని అనుకోవాలి మనం.

ఆకాశ మధ్యలో ఉండి దారాపుత్రుల్ని విడిచి వచ్చానన్నాడు విభీషణుడు. రాముడు అభయమిచ్చాక కిందికి దిగి వచ్చాడు. 'పరిత్యక్తా మయా లంకా మిత్రాణిచ ధనాని చ; భగద్గహితం మే రాజ్యం జీవితంచ సుఖానిచ' అన్నాడు. ఇందులో ఆలోచన కల్గించేది 'మే రాజ్యం' అన్నమాట. రాజ్యం అతనిది కాదు. అన్న రావణునిది. అంటే రాజ్యం మీద ఆశ ఉందనే అర్థం స్ఫురిస్తుంది.

పరేంగితావగాహి రామచంద్రుడు. అందుకే సముద్ర జలాలు తెప్పించాడు లక్ష్మణుని చేత. లంకారాజ్యానికి అభిషిక్తుణ్ణి చేసాడు విభీషణుణ్ణి. ఆశ్చర్యకర విషయం ఏమిటంటే ఇంకా సముద్రం దాటలేదు. లంక ముట్టడించలేదు. యుద్ధం జరుగలేదు. రావణుడు చావలేదు. విభీషణుడు లంకకు రాజయ్యాడు. అది రాముని పరమ కరుణార్ద్ర హృదయానికి నిదర్శనం. రాజనీతికి పరాకాష్ఠ.

దుర్మార్గునికి దూరంగా ఉండాలి. వాడిని అస్సలు చేరదీయరాదు. ఇది సామాన్య ధర్మం. దుర్మార్గుడైనా కృతఘ్నుడైనా వధ్యుడైనా శరణాగతి పొందితే రక్షించాలి. ఇది విశేష ధర్మం. సుగ్రీవునితో రాముడు అంటాడు ఇలా. 'విభీషణో వా యదివా రావణస్స్వయం'- "విభీషణుడే కాదు. చంపదగిన రావణుడు స్వయంగా వచ్చి శరణు వేడితే అభయమిస్తాను. రక్షిస్తాను". ఆ మాటల్లో విశేషార్థం ద్యోతకమవుతుంది. విభీషణునిలాంటి ధార్మికులకే, రావణుని లాంటి దుర్మార్గులకే కాదు పశుపక్ష్యాదులకు కూడ అంటే సకల ప్రాణులకు కూడ అభయమిస్తానని రాముని ప్రతిజ్ఞ అని రాముడు మాయామానుష విగ్రహుడని సర్వలోక శరణ్యుడని స్పష్టమవుతోంది.

"తన భార్య అయిన ఆడపావురాన్ని చంపిన

బోయవానికి ఆశ్రయమిచ్చింది ఒక మగ పావురం. అంతేకాదు ఆకలి తీర్చటానికి వానికి తన మాంసం ఆహారంగా సమర్పించుకుంది. ఒక పక్షి వైరభావాన్ని విడిచి శత్రువుపట్ల ఆత్మార్పణ గావించుకున్నపుడు ఒక ఉత్తమ క్షత్రియ వంశంలో పుట్టిన నేనెలా ప్రవర్తించాలి. మిత్రభావంతో వచ్చిన శత్రువులో దోష ప్రవృత్తిని చూడను. శరణాగతుడయ్యాడు రక్షిస్తాను. అలా చేయకపోతే ఉత్తమగతులు లభించవని యశోహాని కల్గుతుందని చెప్పిన కండు మహర్షి మాటలు ఆచరణలో పెడతాను'' అని శరణాగత రక్షణత్వానికి ప్రతీకగా నిలిచాడు రాముడు.

రామాయణాన్ని దీర్ఘ శరణాగతి శాస్త్రం అంటారు పెద్దలు. దశరథుని పుత్రకామేష్టియాగ సందర్భంగా రావణ వధ కోసం నారాయణుని శరణాగతి చేసారు దేవతలు. వనవాస సమయంలో సీతమ్మ ద్వారా శరణువేడి లక్ష్మణస్వామి సీతారాముల వెంట నడిచాడు. రాక్షసుల బారి నుంచి కాపాడాలని దండకారణ్యంలో రామునికి శరణాగతి చేసారు మునీశ్వరులు. చిత్రకూటంలో ప్రాణభిక్ష కోసం కాకాసురుడు శరణువేడుకున్నాడు. బతకాలని ఆశ ఉంటే రాముని శరణు వేడుకో అని రావణునికి హితోపదేశం చేసింది సీతమ్మ. విభీషణుని శరణాగతి సరేసరి, సముద్రం దాటటానికి దర్భశయనుడై రాముడు సముద్రుని శరణువేడాడు. కాని ఆ శరణాగతి ఫలించలేదు. కారణం శరణ్య లక్షణాలు సముద్రునిలో లేవు. శరణాగత లక్షణాలు రామునిలో లేవు. శరణాగత త్రాణ పరాయణత్వం ఒక్క నారాయణునికే చెల్లు. కనుక భగవదనుగ్రహ ప్రాప్తికి శరణాగతి అత్యావశ్యకం.



# మన జీయర్ స్వామివారు

నవంబరు 2వ తేదీ నుండి 7వ తేదీ వరకు ఆశ్రమంలో పరమాచార్య స్వామివారి తిరునక్షత్ర ఉత్సవాలు నిర్వహించారు.

నవంబరు 8వ తేదీ నుండి 11వ తేదీ వరకు విశాఖపట్టణం రామానుజపీఠంలో వేంచేసి ఉన్నారు.

నవంబరు 12, 13వ తేదీలలో భద్రాచల యాత్ర చేసారు.

నవంబరు 14వ తేదీ సాయంకాలం నుండి 22వ తేదీ ఉదయం వరకు అనకాపల్లిలో సుందరకాండ పారాయణ మరియు మల్టీమీడియా కార్యక్రమాలు నిర్వహించారు. ఆ రాత్రికి ఆశ్రమం చేరుకున్నారు.

నవంబరు 23వ తేదీ నుండి డిశంబరు ఒకటవ తేదీ వరకు ఆశ్రమంలోనే వేంచేసి ఉండి శ్రీరామాయణం నవరాత్ర పారాయణ కార్యక్రమాన్ని జరుపుతారు.

డిశంబరు 5వ తేదీ నుండి 15వ తేదీ వరకు సింగపూర్‌లో వేంచేసి ఉండి అక్కడ ఆధ్యాత్మిక కార్యక్రమాలను నిర్వహిస్తారు.

డిశంబరు 16వ తేదీ నుండి 2012 జనవరి 15 వరకు నల్లగొండలో ధనుర్మాస వ్రతాన్ని నిర్వహిస్తారు.

అటు తరువాత కాకినాడ వేంచేస్తారు.





Printed by P. Daniel and Published by D. Satya on behalf of Srimath Upanishad Siddhantha Acharya Peetham and Printed at Sowmya Art Printers at Kakinada and published at Saranya Publications, Kakinada. Edited by Chitrakavi Atreya

# తపోవనం ట్రస్టు ప్రచురణలు

ఆధ్యాత్మిక రంగంలో ప్రత్యక్షానుభవాన్ని భగవదనుగ్రహం వలన అపారంగా లభింపచేసుకున్న మా ఆచార్యులు పరమహంస పరివ్రాజకాచార్య **శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారు** తమ అనుభవాలని అన్యాపదేశంగా వివరిస్తూ చేసిన వివిధ రచనలనే **లోకమంతా ఉజ్జీవించడానికి మార్గదర్శకంగా** తపోవనం ట్రస్టు ముద్రిస్తున్నది. అవి

1 జపం చేయడం ఎలా ?
2 ఆచార్య శ్రీసూక్తులు
3 ఆచార్య దేవోభవ
4 ఆచార్య దేవోభవ! (తపోవన గ్రంథమాల )
5 నేను నా గమ్యం (మొదటి భాగం) (తపోవన గ్రంథమాల )
6 భూ ప్రదక్షిణ (మొదటి భాగం) (తపోవన గ్రంథమాల )
7 విష్ణు సహస్రనామాలకి అర్థం ఏమిటి? (మొదటి భాగం) (తపోవన గ్రంథమాల)
8 రండి! మన జీవిత లక్ష్యాన్ని ఆవిష్కరించుకుందాం! (తపోవన గ్రంథమాల)
9 శ్రీకృష్ణార్జున సంవాదం (1,2 భాగాలు) (తపోవన గ్రంథమాల)
10 పంచ సంస్కారపరుల గృహములలో భగవదారాధన
11 శ్రీరామానుజులు (తపోవన గ్రంథమాల)

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగరామానుజ జీయర్ స్వామివారు అనుసంధానం చేసిన

1 భగవద్గీత 1,2,3 - సి.డి.లు , క్యాసెట్లు
2 విష్ణుసహస్రనామం - సి.డి.
3 సంక్షేపరామాయణం, లక్ష్మీఅష్టోత్తరం, విష్ణు సహస్ర నామ స్తోత్రం - సి.డి.
4 మాంగళ్య వివృద్ధిస్తోత్రం, కనకధార స్తవం - సి.డి.
5 తిరుప్పావై (ధనుర్మాస వ్రతం) - సి.డి. మొదలగునవి తపోవనం అందిస్తోంది.

Saranya Adhyatmika Patrika - Registered with the R.N.I. No. 72164/99 - Postal Regn. # AP/KD-117/2009-2011. d.o.p.: 27th & 28th

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారి మంగళాశాసనములతో...

CENTRE FOR EXCELLENCE



## Nagarjuna College of Engineering & Technology

*(Affiliated to Visveswaraiah Technological University (VTU) & Recognized by Govt. of Karnataka & Approved by A.I.C.T.E. New Delhi)*

### Courses Offered in Bachelor of Engineering

- Electronics & Communication Engineering
- Computer Science & Engineering
- Information Science & Engineering
- Bio-Technology
- Mechanical Engineering
- Civil Engineering

## Nagarjuna Pre-University College

*(Affiliated to P.U.Board & Recognized by Govt. Of Karnataka)*

**Courses Offered :** ■ Science ■ Commerce

## Nagarjuna Vidyaniketan

*(Affiliated to C.B.S.E. New Delhi)*

■ Pre-Nursery to X Std. ■ Teacher-Student Ratio – 1:15 ■ 100% results from inception



## NAGARJUNA EDUCATION SOCIETY

No. 38/1, Ramagondanahalli, Yelahanka, Bangalore - 64
Tel: (080) 28564002 / 28564004 Fax: (080) 28564004
Visit us at: www.nagarjunaeducation.com